
CHANDAMAMA
चन्दामामा
चांदोबा

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!





It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !









HANDAMAMA
OLLECTION

ARTIG 1246

# BACK TO SCHOOL WITH CHELPARK

**CHELPARK RANGE OF PRODUCTS**

WAX CRAYONS, WATER COLOUR CAKES, PEN, PENCIL, INK, OIL PASTELS, MOPPLES COLOUR SET, WATER COLOUR SET.




**CHELPARK COMPANY PVT. LTD.**
A-93, Industrial Estate, Rajajinagar,
Phone: 91-080-3351562/3351694

# చందమామ




సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## ప్రాంతీయ భాషల అభివృద్ధి

మన దేశంలో అత్యధిక విద్యాసంస్థలలో అంటే, పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ విద్యాబోధన ఇంకా ఇంగ్లీషుభాషలోనే కొనసాగుతున్నది. ప్రపంచంలో మనదేశం ఒక్కటే ఉన్నత విద్యాభ్యాసం కోసం విదేశీభాష మీద ఆధారపడుతున్నది.

నలభై అయిదు లక్షల జనాభా గల దక్షిణ కొరియా వంటి అతి చిన్న దేశంలో సైతం ఉన్నత విద్యాభ్యాసానికి కావలసిన పుస్తకాలు కొరియా భాషలోనే లభ్యమవుతున్నాయి. సువిశాలమైన మనదేశంలో ముఖ్యంగా పదిహేను భాషలకు పైగా మాట్లాడేవారున్నారు. ఆయా భాషలలో, రోజురోజుకూ అభివృద్ధి చెందుతూన్న విజ్ఞాన, సాంకేతిక రంగాలకు సంబంధించిన విషయాలను బోధించడానికి తగిన సాంకేతిక పదజాలం సమకూర్చుకోవాలి.



మాతృభాషలో విద్యాబోధన జరగాలన్న ఉద్దేశంతో చాలాకాలంగా ప్రాంతీయ భాషలలో పాఠశాల స్థాయి వరకు వివిధ పాఠ్యాంశాలలో పుస్తకాలు వెలువరిస్తున్నారు. కాని కళాశాల స్థాయిలో ఆ కృషి అంతగా కనిపించడం లేదు.

మన దేశంలో ఒకప్పుడు సంస్కృతం అధికార భాషగా ఉండేది. ఆ కారణంగా అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులుగా మిగిలిపోయి, అల్ప సంఖ్యాకులు విద్యా పరిపాలనా రంగాలలో ఆధిక్యత వహించే పరిస్థితులకు దారితీసింది. ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో ఇంగ్లీషుకు ప్రాముఖ్యత వచ్చింది. ఆంగ్లేయులు వెళ్ళిపోయినా, వారి భాషను మాత్రం మనం ఇంకా వదలలేకుండా ఉన్నాం. అందువల్లనే మన ప్రాంతీయ భాషల అభివృద్ధి అంతంత మాత్రంగానే ఉందన్న అభిప్రాయం కూడా ఉన్నది.



ఏది ఏమైనా మాతృభాషలో విద్యాబోధన జరిగినట్టయితే అది విద్యార్థుల పాఠ్యాంశాల అవగాహనకు మరింత, దోహదం చేస్తుందనడంలో సందేహం లేదు. పాఠశాల స్థాయిలోనే కాకుండా, కళాశాల స్థాయిలో కూడా మాతృ భాషలోనే విద్యాబోధనకు తగిన విధంగా ఆయా ప్రాంతీయ భాషలను, పదజాలాన్ని అభివృద్ధి చేయవలసిన అవసరం ఎంతయినా ఉన్నది.

సంపుటి : 97 నవంబర్ '95 సంచిక: 5

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00





# చందమామ

నవంబర్ 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 5.00

సంవత్సర చందా : 60.00

## వార్తలు -- విశేషాలు :

# హాంకాంగ్ విశేషాలు

హాంకాంగ్‌ను గురించిన వార్తలు పత్రికలలో ఇటీవల ఎక్కువగా వస్తున్నాయి. ప్రపంచపటాన్ని పరిశీలించినట్టయితే, చైనాకు సమీపంలో ఆగ్నేయ దిశగా ఒక చిన్న చుక్కలాగా కనిపిస్తుంది హాంకాంగ్. నిజానికి ఇది 1000 చ.కి.మీ. విస్తరించిన 235 దీవుల సమూహం. ఇక్కడ దాదాపు 59,00,000 మంది ప్రజలు నివసిస్తున్నారు.

'క్రౌన్ కాలనీ'గా ప్రసిద్ధిగాంచిన హాంకాంగ్ గత 155 సంవత్సరాలుగా బ్రిటిష్ అధికారం కింద ఉన్నది. శాసన సభకు గత సెప్టెంబర్‌లో కట్టకడపటి ఎన్నికలు జరిగాయి. ఎందుకంటే 1997వ సం॥ జూన్ 30వ తేదీ హాంకాంగ్ బ్రిటిష్ అధికారం నుంచి విడిపోయి ప్రధాన దేశమైన చైనాతో కలిసిపోతుంది.

16వ శతాబ్దంలో మొదట పోర్చుగీసులు ఇక్కడికి చేరారు. 18వ శతాబ్దారంభానికి ముందు బ్రిటిష్ వాళ్ళు ఇక్కడికి వచ్చారు. భారతదేశంలో అధికారం చేపట్టిన ఈస్టిండియా కంపెనీ, చైనాతో వర్తకసంబంధాలు ఏర్పరుచుకున్నది. నల్లమందును వస్తుమారకానికి తీసుకోవాలని బ్రిటన్ పట్టుబట్టడంతో వారి సంబంధాలు చెడిపోయి 'నల్లమందు యుద్ధాలకు' దారితీసింది. ఆఖరికి 1841వ సం॥లో చైనా హాంకాంగ్‌ను బ్రిటన్‌కు వదులుకోవలసి వచ్చింది. 1898వ సం॥లో ఆ ప్రాంతం 99 సంవత్సరాల లీజుకు బ్రిటన్‌కు ఇవ్వబడింది. ఇప్పుడు 1984వ సం॥లో ఉభయ దేశాల మధ్య ఏర్పడిన ఒప్పందం ప్రకారం1997 జూలై 1వ తేదీ చైనా ఆ ప్రాంతం మీద అధికారం చేపడుతుంది.

గత యాభై సంవత్సరాలలో ఆధునిక పారిశ్రామిక రంగంలో హాంకాంగ్ ఎన్నో విజయాలను సాధించింది. విద్యుత్ పరికరాలు, ఎలక్ట్రానిక్ పరికరాలు, రసాయనిక పదార్థాలు, వివిధ సాంకేతిక ఉపకరణాలు, ప్లాస్టిక్స్, పింగాణీ, వస్త్రాలు, నౌకానిర్మాణంతో పాటు వివిధ శాఖలలో అద్భుతమైన ప్రగతిని సాధించింది. దక్షిణ కొరియా, సింగపూర్, తైవాన్ (ఇది కూడా ఒకప్పుడు చైనాలో భాగమే)లతో పాటు హాంకాంగ్‌ను 'ఆసియా పులులు'గా అభివర్ణించేవారు.

మొన్న జరిగిన శాసనసభ ఎన్నికలలో ముఖ్యంగా చైనాను వ్యతిరేకించే డెమొక్రటిక్ పార్టీకి, చైనాకు మద్దతునిచ్చే డెమొక్రటిక్ అలయెన్స్‌కూ మధ్య పోటీ జరిగింది. 60 స్థానాలున్న శాసనసభలో డెమొక్రటిక్ పార్టీ ఆధిక్యతను సాధించింది. డెమొక్రటిక్ పార్టీ విజయం చైనాకు ఒక హెచ్చరికగా మిగిలింది.

1984వ సం॥లో చైనా బ్రిటన్‌ల మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం ఇతర విషయాలతో పాటు హాంకాంగ్ వాణిజ్య, పౌరసత్వ స్వాతంత్ర్యాలకు కనీసం యాభై సంవత్సరాల వరకు ఎటువంటి అంతరాయం కలిగించకూడదన్నదిఒకముఖ్యమైనఅంశం.అంటే,"ఒకదేశం-- రెండు విధానాలు" అమలులో ఉంటుందన్నమాట.

ఇటీవల హాంకాంగ్ ప్రజలను బ్రిటన్, ప్రధాన దేశమైన చైనాకు వ్యతిరేకంగా పురికొల్పుతున్నదని చైనా ఆరోపిస్తున్నది. ఈ ధోరణి కొనసాగినట్టయితే అధికార మార్పిడి తరవాత ఎన్నికల ఫలితాలను రద్దు చేయగలమని చైనా హెచ్చరించింది.

ఈ పరిస్థితులలో హాంకాంగ్ ప్రధాన దేశమైన చైనాతో కలిసి ఉండగలదా? లేక స్వయం ప్రతిపత్తిగల దేశంగా రూపొందుతుందా? అన్న ప్రశ్నకు మరొక రెండు సంవత్సరాలలో సమాధానం లభిస్తుంది.





# పిల్లిగడ్డం మంత్రగాడు

కోటగిరి రాకుమారి రూపవతి, పేరుకు తగినట్టుగా గొప్ప రూపవంతురాలు. పద్ధెనిమిది సంవత్సరాల వయసు వచ్చినా, ఆమెలో ఇంకా చిలిపితనం పోలేదు. ఇందుకు తోడుగా ఆమెలోతెగింపూ,తొందరపాటూపాలుఎక్కువ. ఆమె కొండమీది దేవీఆలయానికి వెళుతున్నానని చెప్పి, తన ఇష్టసఖి విమలతో దాపులనున్న అడవికి పోయి, అక్కడ చెట్లకిందా, సెలయేళ్ళ పక్కనా తిరుగుతూండేది.

ఆ ఇద్దరూ అడవిలో తిరుగుతూన్నప్పుడు, కొండమీద పాతకాలపు కోట ఒకటి కనిపిస్తూం దేది. రూపవతి, ఆకోటనువిమలకు చూపుతూ, "ఏదో ఒకనాడు ఆ కొండ ఎక్కి కోట అంతా తిరిగి చూడాలి!" అంటూండేది.

ఆ మాటలకు విమల భయపడిపోతూ, "రాకుమారీ! అలాంటి ఆలోచనలు మానుకో. పాడుబడిన కోటలను రాక్షసులుగానీ, మంత్రగాళ్ళుగానీఆక్రమించుకునివుంటారు," అనేది.

"నీకన్నింటికీ భయమే!చూస్తూండు, నేను ఏదోఒకరోజు ఒంటరిగానైనా వెళ్ళి,ఆకోటలో ఏమున్నదో తప్పకుండా చూసి వస్తాను," అనేది రూపవతి.

కుమార్తెకు త్వరగా వివాహం చేస్తే, ఆమెలో మార్పు వస్తుందని భావించిన రాజదంపతులు, రామగిరి యువరాజుతో రూపవతి వివాహం నిశ్చయం చేశారు.

ఈవివాహం రూపవతికి ఏమాత్రం ఇష్టం లేదు. ఆమె ఈ సంగతి తల్లిదండ్రులకు చెప్పి, "తెలియకడుగుతాను! ఈ రాకుమారుడిలోవున్న ప్రత్యేకత ఏమిటి?" అని అడిగింది.

వాళ్ళు రూపవతి ప్రశ్నకు ఆశ్చర్యపోయి, "ఈ రామగిరి యువరాజు రత్నసేనుడు. గురుకులంలో విద్య పూర్తి చేశాడు.ఏదో ఒకనాడు రామగిరికి రాజవుతాడు," అన్నారు.

ఆ జవాబుకు రూపవతి ముఖం చిట్లించి, "అందగాడు, విద్యావంతుడు, ఏదో ఒకనాడు

మాచిరాజు కామేశ్వరరావు

సింహాసనం అధిష్ఠించని రాకుమారుడంటూ ఎవరూ వుండరు! నేనడిగేది వాళ్ళల్లో వున్న ప్రత్యేకత గురించి. నేనడిగే అర్థంపర్థం లేని మూడు ప్రశ్నలకు అర్థవంతంగా జవాబు చెప్పగలవాడినో, నీళ్ళ మీద నడవగలిగిన వాడినో, గాలిలో ఎగరగలిగిన వాడినో—ఇలా ఏదయినాప్రత్యేకత వున్నవాడినే నేను పెళ్ళాడు తాను," అన్నది.

ఈ జవాబుకు రాజదంపతులు మరింతగా ఆశ్చర్యపోయి, "నీకేమైనా గాలిసోకలేదు గదా! ఇది నీకు అన్ని విధాలా తగిన సంబంధం. యువరాజురత్నసేనుడితోనే నీపెళ్ళి,"అన్నారు.

ఇంతలో రత్నసేనుడు, బంధుమిత్ర సపరివారంగా వచ్చి, రాజభవనానికి దాపులనున్న విడిదిలో దిగాడు. అయితే పెళ్ళిఇంకా రెండు రోజులున్నదనగా, రూపవతి అంతఃపురంలో కనబడకుండా పోయింది. ఈ జరిగినదానికి రాజదంపతులు దుఃఖించి, కుమార్తె కోసం అంతటా వెతికించి, చివరకు రాజభటులను ఆమెజాడ తెలుసుకునేందుకు రాజ్యం నలుమూలలకూ పంపారు.

రూపవతి ప్రియసఖి అయిన విమల, రాకుమారి పంతంకొద్దీ అజ్ఞాతంలోకి వెళ్ళిందని గ్రహించింది. ఆమె తప్పక ఎన్నాళ్ళుగానో చూడాలనుకుంటున్న కొండమీద పాడుబడిన కోటకు వెళ్ళి వుంటుందని ఊహించింది. రాకుమారిని పెళ్ళివేళకు సురక్షితంగా తీసుకురావడం తన కర్తవ్యంగా భావించి, విమల



ఎవరికీ చెప్పకుండా కోటకేసి బయలుదేరింది. ఆమె కొండ మీదికి చేరేసరికి సాయంత్రం అయింది. కోటతలుపు మూసి వున్నది. దాని తలుపుకు వున్న రంధ్రంగుండా విమల లోపలికిచూసి ఆశ్చర్యంతోపాటు భయంతో కంపించిపోయింది.

శిథిలావస్థలో వున్న కోటతలుపుకు చాలా సమీపంలో, ఒక పెద్ద కొలను. దాని ఒడ్డున గాలాన్ని నీటిలో వేసి ఒక కురూపి కూర్చుని వున్నాడు. వాడి నడుము విల్లులా వంగిపోయి వున్నది. పిల్లిగడ్డం, మిడిగుడ్లు, కారునలుపు దేహం. ఒక చిరుగులఅంగీ ధరించి వున్నాడు. పక్కనే రాకుమారి రూపవతి కళ్ళ నీళ్ళతో కూర్చుని వున్నది!



పిల్లిగడ్డం వాడు గాలం కర్రను నీటిలోంచి బయటికి లాగి ఝుళిపిస్తూ, రూపవతితో, "ఓయ్, పిల్లా!నేను అట్టే మంచివాణ్ణి కాను, జాగ్రత్త! నన్ను పెళ్ళాడ నిరాకరించిన వాళ్ళను చేపలుగా మార్చి, ఈ కొలనులో వేస్తుంటాను, వాళ్ళే నా ఆహారం," అన్నాడు.

ఆ మాటలకు రూపవతి,"రామగిరి యువ రాజు భార్యను కావలసిన నేను, అవివేకినై ఇక్కడికొచ్చాను. నువ్వు మంత్రగాడివి. తల నెరిసి పోయి పళ్ళూడిన ముసలాడివి. నిన్ను నేను పెళ్ళాడటమా?" అన్నది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

పిల్లిగడ్డం మంత్రగాడు కోపంగా రూపవతి కేసి చూసి, "పొగరుగా మాట్లాడకు! కొలను పాలయ్యేలోపల నీకు రెండు రోజుల గడువు ఇస్తున్నాను. అప్పటి వరకూ, ఈ మంచి నీళ్ళ కుండే నీ లోకం," అంటూ గాలం కర్రతో ఆమె తలను తాకాడు.

మరుక్షణం రూపవతి చేపలా మారి నేల మీద ఎగిరెగిరి పడసాగింది. మంత్రగాడు వికటంగా నవ్వుతూ చేపను పక్కనే వున్న నీళ్ళకుండలో వేసి మూత పెట్టేశాడు.

ఆసరికిచీకట్లు ముసురుకోవడంతో, వాడు ఒక కాగడా వెలిగించాడు. ఇదంతా చూసిన విమల, ఎక్కడలేని తెగింపుతో కోట తలుపు తట్టింది. వెంటనే మంత్రగాడు తలుపుకేసి వస్తూ, "ఏమా సాహసం! చీకటిపడి మనిషన్న వాడు, ఈచాయలకు రావడమేమిటి? తలుపు తట్టడమేమిటి?" అంటూ వచ్చి తలుపుతెరి చాడు.

విమల భయపడుతూనే వాడితో, "దూర ప్రయాణం చేస్తూ, చీకటివేళ ఇక్కడ చిక్కుకు పోయాను. నీ కోటలో ఈ రాత్రికి ఆశ్రయం ఇస్తావా, మామయ్యా?" అన్నది.

మంత్రగాడి వికారరూపం చూసి ముఖం చిట్లించని వారుండరు. అటువంటిది, ఒక ఆడపిల్లనోరారా మామయ్యా అని పిలవడంతో వాడు పరమానందం చెంది, "దానికేంభాగ్యం పిల్లా! చీకటి వేళల్లోనే కాదు, పగటి వేళల్లో అయినాఅందమైన ఆడపిల్లలకు, ఈ కంచు కోటలో ఆశ్రయం దొరుకుతుంది, లోపలికి రా," అన్నాడు.

విమల లోపలికి వెళ్ళగానే వాడు తలుపు మూసి, "నీ అందం చూడడానికి, ఈ ఒక్క కాగడా వెలుగు చాలదు. మరొక కాగడా వెలిగించుకొస్తాను," అంటూ దూరంగా వున్న పాడుబడ్డ గదులకేసి వెళ్ళాడు.

అదే అదనుగా విమల నీళ్ళకుండ మీది మూత తీసింది. ఆమెను గుర్తించిన రూపవతి కుండలో ఎగిరెగిరి పడసాగింది. విమల, రాకుమారితో, "యువరాణీ, నిన్ను రక్షించి తీసుకుపోవడానికే వచ్చాను. ఇక భయం లేదు," అన్నది.

అంతలో మంత్రగాడు రావడం చూసి, ఆమె కుండ మీద మూత పెట్టేసి, వాడు దగ్గరకు రాగానే, "ఆహాఁ, నీ కంచు కోట స్వర్గాన్ని గుర్తుచేస్తున్నది. ఈవయసులో కూడా ఇంత అందంగా వున్నావు. డెబ్బై ఏళ్ళ క్రితం మరెంత అందంగా వుండేవాడివో!" అన్నది.

ఆ పొగడ్తతో మంత్రగాడు తబ్బిబ్బయి పోతూ, "నిజంగా డెబ్బై ఏళ్ళ క్రితమే నువ్వు నన్ను చూసి వున్నట్టయితే, మాటా పలుకూ లేకుండా మూర్ఛపోయివుండేదానివి! ఏమయి తేనేం, ఒకళ్ళకొకళ్ళం నచ్చాం. నన్ను పెళ్ళాడి ఈ స్వర్గం లోనే వుండిపో," అన్నాడు.

"అలాగే చేయదలిచాను, మామయ్యా! సరే, ఇక్కడ దొంగల భయం లేదుకదా?" అన్నది విమల భయం నటిస్తూ. ఆ ప్రశ్నకు మంత్రగాడు కళ్ళెర్రచేస్తూ, "ఎంత మాట! ఇక్కడ దొంగల భయమా? తలచుకుంటే



ఈ కోటను గగనమార్గాన నడిపించి, వింధ్య పర్వతాల మీద పెట్టగలను. అంత అద్భుతమైనది, నా మంత్రశక్తి," అని ఒక క్షణం ఆగి, "అయినా, నీ దగ్గర ఏ మణి మాణిక్యాలున్నవని దొంగల భయం?" అని అడిగాడు, వికారంగా నవ్వుతూ.

విమల వాడికి చప్పున తన వేలిన వున్న రవ్వల ఉంగరం చూపిస్తూ, "మామయ్యా, ఇది మామూలు రవ్వల ఉంగరం అనుకునేవు, కాదు ఎంతో మహత్తు గలది. ఆ మధ్య ఒక సిద్ధుడు ఆకాశ మార్గాన ప్రయాణం చేస్తూ, రాత్రివేళ దారి తప్పి పల్లెలోని మా ఇంటి పెరట్లో దిగాడు. ఆ రాత్రి ఆయనకు మా కుటుంబం ఆతిథ్యం ఇచ్చాం. తెల్లవారి ఆ



సిద్ధుడు తన దారిన పోతూ, ఈ ఉంగరాన్ని నాకు బహూకరించాడు," అన్నది.

"సిద్ధ ప్రసాదితమా!" అంటూ పిల్లిగడ్డం మంత్రగాడు ఆశ్చర్యపోయి, "ఇంతకూ, ఈ ఉంగరంలో వున్న మహత్తేమిటి?" అన్నాడు.

"దీన్ని ఎదుటి వాళ్ళకు చూపిస్తూ, వాళ్ళను ఏం చేయమన్నా చేస్తారు. ఒక్క మాటలో చెప్పాలంటే — మనుషుల మనస్సులు మార్చ గల శక్తిఉన్న ఉంగరం ఇది!"అన్నది విమల.

ఆ మాటలు వింటూనే కాగడాల వెలుగులో మంత్రగాడి కళ్ళు మిల మిల మెరిశాయి. వాడు ఉంగరం కేసి ఆశగా చూస్తూ, విమలతో, "నాకు చిన్నప్పటి నుంచీ ఒక కోరిక వున్నది. అది ఏ దేశానికో రాజు కావాలని కాదు; కనీసం రాజుగారి అల్లుడు కావాలని. ఈ నీళ్ళకుండలో చేపగా ఒక రాకుమారి వున్నది. ఆమెను నీ ఉంగరం ప్రభావంతో నా భార్య అయేందుకు ఒప్పించు," అంటూ, కుండను గాలంకర్రతో తాకాడు.

ఆ మరుక్షణం రాకుమారి రూపవతి యథా రూపంలో కుండలో నుంచి బయటికి వచ్చింది. విమల ఆమెకు కన్ను గీటి వేలి ఉంగరాన్ని చూపిస్తూ, "అహఁ, ఏమందం! ఏం సొగసు! చూడగానే రాకుమారి అయి వుంటావన్న నమ్మకం కలుగుతున్నది. ఈ నా మామ కొంచెం తిక్క కొద్దీ పైకలా వికృతంగా కనబడుతున్నాడుగాని, అసలు సిసలైన అందగాడు. నీ కన్నివిధాలా తగినవాడు. పెళ్ళాడతావా?" అన్నది.

"తప్పకుండా పెళ్ళాడతాను,"అన్నది రూపవతి.

ఆ మాట వింటూనే మంత్రగాడు, "అహఁ, ఏం నా అదృష్టం!" అంటూ ఆనందం పట్ట లేక ఎగిరి గంతేసి ముందుకు పడబోయి, గాలంకర్ర సాయంతో తమాయించుకుని, "కోడలుపిల్లా! ఆ ఉంగరం, నాకిచ్చెయ్యి. నన్ను అల్లుడుగా కాదు కూడదంటే, ఉంగరం చూపి రాజు మామయ్య మనస్సు మార్చు తాను," అంటూ చేయి సాచాడు.

అదే అదనుగా విమల వాడి చేయి పట్టుకునిబలంగా ముందుకు గుంజి,వాడు బోర్లా పడుతున్న సమయంలో చేతిలోని మంత్రపు

గాలంకర్ర లాక్కుని, వాడి తల మీద గట్టిగా మోదింది.

అంతే! మంత్రగాడు చేపగా మారి ఎగిరెగిరి పడుతూ పోయి కొలనులో పడ్డాడు.

"అమ్మయ్య! ఎంతతెలివిగా నన్ను కాపాడావే, విమలా!" అంటూ రాకుమారి, తన ఇష్టసఖిని కౌగిలించుకుని, "ఇక రాచనగరుకు పోదాం పద. నీ పెళ్ళికి నువ్వు కలలో కూడాఊహించనిగొప్పబహుమానం ఇస్తాను," అన్నది.

వాళ్ళు తిరిగి రాజభవనం చేరుకునేసరికి తెల్లవారిపోయింది. క్షేమంగా తిరిగి వచ్చిన కుమార్తెను చూసి, రాజదంపతులు ఎంతగానో సంతోషించారు.ఆసమయంలో అక్కడ పెళ్ళికుమారుడు రత్నసేనుడు కూడా వున్నాడు.

రూపవతి జరిగినదంతా వాళ్ళకు చెప్పి, "ఏదో ఒక ప్రత్యేకత వున్న వాడినే పెళ్ళాడాలన్న వెర్రిమొర్రిఆలోచనలతో నేను బాధపడి, మీ అందరికీ బాధ కలిగించాను.ఇప్పుడు మీరు నిర్ణయించినరాకుమారుణ్ణివివాహమాడడానికి, నాకెలాంటి అభ్యంతరమూ లేదు!" అన్నది.

దానికి రాజదంపతులు ఏదో అనబోయేంతలో, అప్పటివరకూ విమల కేసి కన్నార్పకుండా చూస్తున్న యువరాజు రత్నసేనుడు, "క్షమించు యువరాణీ! మీకు అభ్యంతరం లేకపోయినా, నాకున్నది. పిల్లిగడ్డం మంత్రగాడిమాయలో చిక్కుకున్న మిమ్మల్ని, ఎంతో తెలివితేటలతో, సాహసంతో విముక్తురాలిని చేసిన, మీ ప్రియసఖి విమలలో నాకు ఎనలేని ప్రత్యేకత కనిపిస్తున్నది. ఆమెను నేను వివాహమాడదలిచాను," అన్నాడు.

ఇది విని విమలకు నోట మాట రాలేదు. ఆమె సిగ్గుతో తలవంచుకున్నది. రూపవతి ఒక క్షణం నివ్వెరపడి, తర్వాత చిరునవ్వుతో విమల భుజం మీద చెయ్యివేసి, "అవును, విమలా! నా మాట నేను నిలుపుకున్నాను. నీ పెళ్ళికి గొప్ప బహుమానం ఇస్తానన్నాను గదా? ఇది నువ్వు కలలో కూడా ఊహించని బహుమానం," అన్నది.

తర్వాత రాజదంపతుల ఆధ్వర్యంలో విమలా, యువరాజు రత్నసేనుడి వివాహం వైభవంగా జరిగిపోయింది.



# పరోపకారి!

రెండెడ్ల బండిలో, తన పొలాన పండిన గుమ్మడికాయలను వేసుకుని, పట్నంలో లాభసాటిగా అమ్మి వస్తున్న రాజయ్యకు, దారికి అడ్డంగా ఒకచోట పెద్ద బండరాయి కనిపించింది. దానిని పక్కకు నెట్టితే తప్ప, ఎడ్లబండి ముందుకు సాగదు. ఆ పని రాజయ్య ఒక్కడివల్లా కాదు.

ఏమి చేయడమా అని రాజయ్య చుట్టూ చూసేసరికి, పక్కన ఎత్తుగా వున్న గుట్టమీద ఒకడు నిద్ర పోతూ కనిపించాడు. రాజయ్య వాణ్ణి నిద్రలేపి, సంగతి చెప్పాడు. తర్వాత ఇద్దరూ కలిసి బండరాయిని పల్లానికి తోశారు.

రాజయ్య, దారిలో బండరాయిని అడ్డంగా పెట్టినవాణ్ణి నానాతిట్లూ తిట్టి, సాయంచేసినవాణ్ణి పరోపకారి, అని మెచ్చుకుని, ఏ ఊరు వెళుతున్నావని అడిగాడు. వాడు, రామాపురం అన్నాడు.

"సరే, బండిలో ఎక్కి కూర్చో. నేను ఎగువనున్న వెంకటాపురం వెళుతున్నాను," అన్నాడు రాజయ్య.

ఎడ్లబండి, రామాపురం చేరగానే వాడు దిగిపోతూ, రాజయ్యతో, "మార్గం మధ్యలో బండరాయిని పెట్టి, మీకు ఇబ్బంది కలిగించాను. ఏమీ అనుకోకండి!" అన్నాడు.

ఆ మాట విని, రాజయ్య ఆశ్చర్యపోతూ, "అదేమిటి? బండరాయిని మార్గానికి అడ్డంగా ఎందుకు పెట్టావు? ఆ పని చేసింది నువ్వని తెలియక, నానాతిట్లూ తిట్టాను," అన్నాడు.

దానికి బండరాయి పెట్టినవాడు చిన్నగా నవ్వి, "నేను పట్నం నుంచి తిరిగివస్తూ, అక్కడికి చేరేసరికి కాళ్ళు చచ్చుపడిపోయినై. ఇక లాభం లేదని, అక్కడ మెరక ప్రదేశంలో వున్న రాయిని కిందికి తోసేశాను. దాన్ని పక్కకు లాగేందుకు, ఏ బండివాళ్ళో నా సాయం కోరక తప్పదు గదా! ఆ రాయి ఒక్కడికి కదలదు, పోతే, మీ తిట్లన్నీ ఎందుకు సహించానంటే — పౌరుషానికి పోతే, మీరు నన్ను బండిలో ఎక్కించుకోరు," అన్నాడు.

వాడి జవాబుకు, రాజయ్య పొట్ట చెక్కలయ్యేలా నవ్వాడు.

— చోడవరపు సత్యప్రకాశరావు






## 5

[అనేక కష్టాలు పడి, అనేక నౌకలనూ, అనేక మంది అనుచరులనూ పోగొట్టుకుని రూపధరుడు సుకేశిని అనే దేవత ఉండే దీవిని చేరుకున్నాడు. తన మనుషులను రెండు దళాలుగా విభజించి,మాయావిఅనేవాడి నాయకత్వం కింద ఒక ముఠాను దీవి యావత్తూ కలయజూడటానికి పంపాడు. వారు సుకేశిని ఇంటికి వెళ్లారు. ఆమె వారికి ప్రేమగా ఆతిథ్యం ఇచ్చి తన మాయాజాలం చేత వారిని పందులుగా చేసేసింది. కాని ఆమె ఎత్తులు, మాయాజాలం రూపధరుడిపై పారలేదు. ఆఖరికి ఆమె అతనికి ఆప్తురాలుగా మారింది. —తరవాత]

సుకేశిని సలహా చెప్పినప్రకారం రూపధరుడు, సముద్రతీరాన ఉన్న తనఅనుచరుల వద్దకు వెళ్ళాడు. వారు నౌకదగ్గర విచారంగా కూచుని వున్నారు.తమ నాయకుణ్ణి చూడగానే తల్లిని చూసిన లేగదూడల్లాగా వారు చెంగుచెంగున గెంతుకుంటూ వచ్చి రూపధరుణ్ణి చుట్టుముట్టారు. ఇథకాకు చేరుకున్నా వారంతకంటె ఎక్కువ సంతోషించి ఉండరు.వారి కళ్లవెంట ఆనందబాష్పాలు కారుతున్నాయి.

"ఏరీ? మనవాళ్లంతా ఏరీ?" అని వారు రూపధరుణ్ణి అడిగారు.

"మనవాళ్లు సుకేశిని ఇంట్లో క్షేమంగా ఉన్నారు.సుఖంగాతింటున్నారు,తాగుతున్నారు. ముందు మనం మన నౌకను తీరానికి లాగి మన తాళ్లూ, ఇతర సామగ్రీ ఏదైనా గుహలో భద్రం చెయ్యాలి. తరవాత నేను మిమ్మల్ని కూడా సుకేశిని ఇంటికి తీసుకుపోతాను," అన్నాడు రూపధరుడు.



వెంటనే వారు పని ప్రారంభించారు. అయితే మాయావి వారితో ఇలా అన్నాడు:

"మూర్ఖులారా! మీరెక్కడికి పోదామనుకుంటున్నారు? సుకేశిని ఇంటికా? ఆమె మిమ్మల్ని సింహాలూ,తోడేళ్లూ చేసేసి, తనఇంటి చుట్టూ కాపలా కుక్కల్లాగా కట్టేస్తుంది, ఏమనుకున్నారో? ఫాలలోచనుడి గుహలో ప్రవేశించి మనవాళ్లేమయ్యారో కాస్త జ్ఞాపకం తెచ్చుకోండి. అప్పుడూ ఈరూపధరుడేపుణ్యంకట్టుకున్నాడు. ఇతని అనాలోచనే వాళ్లను నాశనం చేసింది!"

ఈ మాటలు విని రూపధరుడికి మండిపోయింది. అతను కత్తి దూసి మాయావి కంఠం తెగవెయ్యబోయాడు. కాని మిగిలిన వారు అతన్ని వారించారు. "అతనికి రావటం ఇష్టం లేకపోతే, నౌకను కనిపెట్టుకుని ఇక్కడే ఉండనిద్దాం. మేం నీ వెంట సుకేశిని ఇంటికి వస్తున్నాం. మమ్మల్ని తీసుకుపో!" అన్నారు వారు రూపధరుడితో. కాని తీరా అందరూ బయలుదేరాక మాయావి కూడా సుకేశిని ఇంటికి బయలుదేరాడు.

సుకేశిని రూపధరుడి అనుచరులకందరికీ తలంటి స్నానాలు చేయించి, మంచి మంచి బట్టలు కట్టబెట్టింది. అంతకు మునుపే మాయావి వెంట వచ్చినవారు అప్పుడే భోజనాలు చేస్తున్నారు. రెండు ముఠాలవాళ్లూ ఒకరినొకరు చూసుకుని సంతోషం పట్టలేక గోలగా అరవసాగారు.

సుకేశిని రూపధరుడి వద్దకు వచ్చి, "మీ వాళ్లు గడిచిపోయిన కష్టాలను మరిచిపోతే బాగుంటుంది. నువ్వూ, నీ అనుచరులూ పడ్డ కష్టాలను నేనెరుగుదును. సుఖంగా తినండి, పానీయం తాగండి; మీ ఇథకాలో ఉన్నట్టే ఆనందంగా ఉండండి," అన్నది.

రూపధరుడు ఆమె సలహాను పూర్తిగా పాటించి ఒక సంవత్సరంపాటు తన అనుచరులతో సహా ఆమెకు అతిథిగా ఉండిపోయాడు. సంవత్సరం పూర్తికాగానే రూపధరుడి అనుచరులందరూ కలిసి, "ఏమిటిది? మనం ఇక ఇంటికిప్రయాణమైపోయేది లేదా ఏం?" అన్నారు.

రూపధరుడు సుకేశినితో, "నా అనుచరులు స్వదేశానికి పోవటానికి తొందరపడుతున్నారు.

నేనిక బయలుదేరటం మంచిది. మా ప్రయాణానికి నీ సహాయం కావాలి!" అని అడిగాడు.

"నిన్ను బలవంతాన ఉంచటం నాకిష్టం లేదు. కాని, నువ్వు మీ దేశానికి వెళ్ళిపోయే ముందు ఇంకొక ప్రయాణం చెయ్యవలసి ఉంది. యములవాళ్ళుండే నరకంలో సాంకేతికుడు అనే దివ్యజ్ఞాని ఉన్నాడు. చచ్చిపోయినా అతనికి దివ్యజ్ఞానం పోలేదు. నువ్వు అతణ్ణి ఒకసారి కలుసుకుని అతని సలహా తీసుకోవాలి," అన్నది సుకేశిని.

ఈ మాట వినగానే రూపధరుడు హతాశుడైపోయాడు. "అయ్యో, సుకేశినీ, నరకానికి ప్రయాణం చెయ్యటం నావల్ల అయ్యేపనేనా? ఎవరైనా నరకానికి నౌకలో వెళ్ళి ఉన్నారా?" అని అతను అడిగాడు.



"నువ్వు పడవకు చుక్కానిపట్టి దిక్కులు చూస్తూ కూచోనవసరం లేదు. తెరచాప స్తంభం లేపి, తెరచాప ఎత్తి మాట్లాడకుండా కూచో, ఉత్తరవాయువు నీ నౌకను నేరుగా నరకం చేర్చుతుంది.నీనౌక సముద్రం దాటినాక తీరం వస్తుంది. అక్కడ నరకవృక్షాలుంటాయి. నీ నౌకను తీరాన కట్టేసి యమలోకానికి కాలినడకను బయలుదేరు. కొంత దూరం వెళ్ళాక నీకు ఒక గుట్ట కనిపిస్తుంది. దాని సమీపంలోనే అగ్నినదీ, అశ్రునదీ కలిసి వైతరణీనది అవుతుంది. ఆ రాతి దగ్గిర మూరెడు పొడుగూ, మూరెడు వెడల్పూ గల గొయ్యి తవ్వు. ఆ గోతిలో పితృదేవతలకు తర్పణాలు విడిచి, పిండప్రదానం చెయ్యి. ఈ విధంగా పితృదేవతలను అర్చించి, నిన్ను క్షేమంగా ఇథకా చేర్చమని వారిని ప్రార్థించు. ఇల్లు చేరినాక వారికి బలు లిస్తానని వాగ్దానం చెయ్యి. సాంకేతికుడికి విడిగా ఒక నల్లగొర్రెపోతును బలి ఇస్తానని దణ్ణం పెట్టుకో. తరవాత ఒక నల్ల ఆడగొర్రెనూ, నల్లగొర్రెపోతునూ అక్కడ బలియిచ్చి అగ్నిలో వేల్చు.ఇలా చేసి యమధర్మరాజుకూ, నరకవాసులకూ,దణ్ణాలు పెట్టుకో. ఇంతలో పితృదేవతలు బలి ఆరగించటానికి వస్తారు. వారిలోసాంకేతికుడుకూడాఉంటాడు. ఆయన నీకు ఇంటికి పోయే ఉపాయమూ, మార్గమూ చెప్పినదాకా పితృదేవతలెవరూబలులు అంట



కుండా చూసుకో!" అని సుకేశిని రూపధరుడికి వివరించి చెప్పింది.

ఇంతలో తెల్లవారింది. రూపధరుడు తన అనుచరులను నిద్రలేవగొట్టి, "నిద్రలేవండి. ఈ ప్రదేశంనుంచిమనం బయలుదేరి వెళ్ళాలి. సుకేశిని మనకొక ప్రయాణం కల్పించింది," అన్నాడు.

పాపం, రూపధరుడి అనుచరులు, ఇంటికి బయలుదేరుతున్నాంగదా అని ఎంతో ఉబలాటపడ్డారు. కాని, తాము పోబోతున్నది యములవాళ్ళుండే నరకానికని తెలియగానే వారు మొర్రో అని గోలపెట్టారు. వారిలో కొందరు జుట్టు పీక్కున్నారు. కాని వారు ఆ చోటుకు వెళ్లక తప్పేది లేదు.

అందరూ కలిసి బయలుదేరి నౌకవద్దకు వెళ్ళేసరికి, అప్పటికే సుకేశిని వచ్చి అక్కడ ఉన్నదీ. ఆమె ఆ నౌకవద్ద ఒక నల్లని ఆడ గొర్రెనూ, నల్లని గొర్రెపోతునూ ఉంచి, ఎవరితోనూ మాట్లాడకుండా తిరిగి వెళ్ళిపోయింది.

గ్రీకులు తమ నౌకను తీరం నుంచి నీటిలోకి లాగారు, తెరచాప స్తంభం ఎత్తి, తెర విప్పారు. నల్లగొర్రెలను తీసుకుని అందరూ నౌకలోకి ఎక్కారు. సుకేశిని అనుగ్రహం వల్ల ఉత్తరం నుంచి మారుతం వచ్చి తెరచాపను నించింది. నౌక కదిలిపోసాగింది.

గాలిపోసుకున్న తెరచాప గాలిపోసుకున్నట్టే ఉంది. సాయంకాలం దాకా నౌక తొణుకూ, బెణుకూ లేకుండా ప్రయాణం సాగించింది. తరవాత సూర్యుడు అస్తమించి, అంతటా అంధకారం ఆవరించింది. ఆ చీకటిలోనే నౌక తీరాన్ని తాకింది.

రూపధరుడు సుకేశిని చెప్పిన ప్రకారమే అగ్నినదీ, అశ్రునదీ కలిసే చోట గుండం తవ్వి, తర్పణాలు విడిచాడు; పిండప్రదానం చేసి, పితృదేవతలను ధ్యానించాడు. తరవాత అతనుగొర్రెలను బలిఇచ్చి, అగ్నిలో హెూమం చేశాడు.

మరుక్షణమే పితృదేవతలు కోలాహలం చేస్తూ, గుంపులు గుంపులుగా బలులు ఆరగించటానికి వచ్చారు. అతను యమధర్మ రాజుకూ యములవాళ్ళకూ దణ్ణాలు పెట్టి, పితృదేవతలతో, "నేను సాంకేతికుణ్ణి కొన్ని

ప్రశ్నలు వేసేదాకా ఎవరూ బలులు ముట్టటానికి వీల్లేదు!" అన్నాడు.

మిగిలినవారిని తోసుకుంటూ ఒక స్త్రీ ముందుకు వచ్చింది. ఆమెను చూసి రూపధరుడు నిర్ఘాంతపోయాడు. ఎందుచేతనంటే, ఆమె రూపధరుడి తల్లే! రూపధరుడు ట్రోయ్‌పై యుద్ధానికి బయలుదేరే నాటికి ఆమె జీవించే ఉన్నది. ఆమె ఎప్పుడు చనిపోయినదీ రూపధరుడు ఎరగడు.

ఆమెను చూసి రూపధరుడు కంట తడి పెట్టుకున్నాడు, జాలి పడ్డాడు. అయినప్పటికీ అతను ఆమెను బలులు తాకనివ్వలేదు.

ఆమె వెనకనే సాంకేతికుడు, చేతిలో బంగారు కర్ర పట్టుకుని వచ్చాడు. ఆయన రూపధరుణ్ణి గుర్తించి, "నాయనా, ఎన్నడూ సూర్యకాంతి ఎరగని ఈ పితృలోకానికి నువ్వెందుకు రావలిసివచ్చింది? కాస్త అడ్డం తొలిగితే, బలి ఆరగించి నీకు చెయ్యవలసిన సహాయం చేస్తాను," అన్నాడు.

రూపధరుడు పక్కకు తొలిగి ఆయనను బలి ఆరగించనిచ్చాడు. తరవాత ఆయన రూపధరుడికేసి తిరిగి, "నాయనా, నువ్వు స్వదేశానికి పోవాలని తహతహలాడుతున్నావు. నిజానికి స్వదేశంకన్న స్వర్గం ఎక్కడుంది? అయితే, దేవతలు నీపై అలిగి ఉన్నారు. అందుచేత నువ్వు పడరాని పాట్లు పడతావు, తప్పదు. ఎన్నికష్టాలు పడినా నువ్వు క్షేమంగా ఇంటికి చేరుకుంటావు. నువ్వు ఇంటికి వెళ్లే



దారిలో త్రినాపియ అనే దీవి వస్తుంది. అక్కడ సూర్యభగవానుడి తాలూకు పశుగణాలుంటాయి. నువ్వుగాని, నీ అనుచరులుగాని వాటి జోలికి పోవద్దు. ఒకవేళ ఆ పశువులకు అపచారం జరిగిందో నీ అనుచరులుగాని, నీ నౌకగాని ఇథకా చేరటం కల్ల. నువ్వు మటుకు చావు తప్పి కన్ను లొట్టపోయినంత పని అయి, ఇంకొకరి నౌకలో ఒంటరిగా ఇంటికి చేరుకుంటావు. అప్పటికీ నీ కష్టాలు అంతం కావు. నీ ఇంటినిండా నీ శత్రువులుండి, తమను పెళ్లాడమని నీ భార్యను పీడిస్తుంటారు. అయితే నువ్వు వారిని ఎలాగో హతమార్చ గలుగుతావు. ఆ శత్రువుల నందరినీ తుదముట్టించినాక నువ్వు దేవతలపట్ల



నీ ధర్మాన్ని నెరవేర్చాలి. అది ఎలా చేయాలో నీకు చెబుతాను. నౌకలు నడిపే తెడ్డు ఒకటి తీసుకుని, అన్నంలో ఉప్పు వాడని వారూ, సముద్రమంటే ఏమిటో ఎరుగని వారూ కనబడేదాకా ప్రయాణం చెయ్యాలి. అటువంటి మనుషులను గుర్తించే మార్గం కూడా నీకు చెబుతాను. వాళ్లు నీ భుజాన ఉండే పడవతెడ్డును గుర్తించ లేక, అది వ్యవసాయపు తెడ్డా అని అడుగుతారు. అటువంటి మనుషులు కనబడిన చోట నీ తెడ్డును భూమిలో గుచ్చి, వరుణదేవుడికి బలులియ్యి. ఒక గొర్రెపోతునూ, ఒక ఎద్దునూ, ఒక ఏదుపందినీ బలి ఇచ్చి ఇంటికి తిరిగి వెళ్లు. నువ్వు దీర్ఘకాలం బతికి, చిట్టచివరకు సముద్రం మూలానే నిశ్చింతగా, సుఖమైన చావు చస్తావు. ఆ సమయంలో నీ ఆప్తులందరూ నీ చుట్టూ ఉంటారు," అని జోస్యం చెప్పాడు.

"సరే కానివ్వండి. విధిని తప్పించుకోవటం నా వశమా? కాని ఒకటి చెప్పండి. అక్కడ నా తల్లి ప్రేతాత్మ నిలబడి ఉన్నది. ఆమె నాకేసి చూడదు, నాతో మాటాడదు, బలులకేసి మాత్రమే చూస్తుంది. ఆవిడ నన్ను గుర్తించే మార్గం ఉంటే చెప్పండి!" అన్నాడు రూపధరుడు.

"నాయనా, బలి ముట్టేదేకా పితృదేవతలు నిజం ఏమిటోతెలుసుకోలేరు,చెప్పలేరు. ఆ సంగతి జ్ఞాపకం ఉంచుకో!" అంటూ సాంకేతికుడు యమలోకానికి తిరిగి వెళ్లిపోయాడు.

రూపధరుడు అక్కడే నిలబడి, తన తల్లి వచ్చి బలి ఆరగించేదాకా వేచి ఉన్నాడు. బలి ఆరగించగానే ఆమె తలఎత్తి చూసి తన కొడుకును గుర్తించి,"నాయనా, బతికిఉండే ఈ లోకానికి ఎలా వచ్చావురా? అది ఎవరికీ సాధ్యం అయ్యేపని కాదే? ట్రోయ్ నుంచి ఇదే రావటమా? ఇంకా ఇథకాకు వెళ్లలేదా? నీభార్యను చూడలేదా?" అని అడిగింది.

"లేదమ్మా! నేను ఇల్లు చేరలేక అష్ట కష్టాలూ పడుతున్నాను.ఇక్కడ ఉండే సాంకేతికుడి సలహా కోరి నేనిక్కడికి రావలసి వచ్చింది! చూడమ్మా, నువ్వు ఎలా చనిపోయావు? జబ్బు చేసిందా, లేక ఆకస్మిక

మరణం సంప్రాప్తమయిందా? నాన్న ఎలా ఉన్నాడు? నా కొడుకేం చేస్తున్నాడు? వాళ్లు నన్నే నమ్ముకుని నాకోసం ఎదురు చూస్తు న్నారా? లేక నేనిక తిరిగి రాననుకుని ఇంకె వరి పంచనైనా చేరారా? నా భార్య ఏమం టున్నది, ఏం చేద్దామనుకుంటున్నది? కొడు కుతో సహా ఆస్తిని చూసుకుంటున్నదా? లేక, ఎవరినన్నా మంచివాణ్ణి చూసి పెళ్ళాడే సిందా?" అని రూపధరుడు తల్లిని అడిగాడు.

"అది నీ ఇంట్లోనే ఉంటున్నది, నాయనా. దాని ఓర్పు ఎటువంటిదనుకున్నావు! అహో రాత్రాలు దాని గుండె దహించుకుపోతున్న దనుకో. నీ ఆస్తీ, హెూదా ఇంకా నీ పేరనే ఉన్నాయి. నీ కొడుకు విజయధ్వజుడు నీ ఆస్తికి హక్కుదారుడుగా ఉంటూ, రాజు చేయవలసిన పనులన్నీ నిర్వహించుకుంటూ వస్తున్నాడు. ఇక మీ నాన్న ఆ పల్లెవాసం విడిచి బస్తీకి రారు. ఆయనకు చలికాలంలో కూడా ఒక పక్కా, దుప్పటీ లేదు, పశువుల మధ్య మట్టిలో, చలిమంటకు దగ్గరగా పడుకుంటారు. ఇక ఇతర కాలాల్లో ద్రాక్షతో టలో ఎక్కడ పడితే అక్కడే ఆయన పడక. ముసలితనానికి తోడు, నువ్వు రాలేదన్న విచారం ఆయనను కుంగదీసేస్తున్నది. ఇక నా చావు మాటంటావా? నేను ఏ జబ్బుతోనూ తీసుకుని చావలేదు, నీకోసం బెంగపడి చచ్చాను!" అన్నది రూపధరుడి తల్లి.

రూపధరుడు తల్లిని మనసారా ఒక్కసారి కౌగిలించుకుందామని ప్రయత్నం చేశాడు, కాని సాధ్యపడలేదు. మూడు ప్రయత్నాలు చేశాడు, మూడూ విఫలమయ్యాయి.

అప్పుడు రూపధరుడు కళ్లనీళ్లు పెట్టుకుని తల్లికేసి దీనంగా చూస్తూ, "ఒక్కసారి నన్ను కౌగిలించుకోనీవమ్మా!ఎందుకు అందకుండా పోతావు?" అన్నాడు.

"బతికున్నవాళ్లు చచ్చినవాళ్లని ఎలా కౌగి లించుకుంటారు, తండ్రీ. నువ్వు కౌగిలించుకో దగినదంతా కాష్ఠంలో కాలి బూడిద అయి పోయింది. వెంటనే ఈ చీకటి లోకం విడిచి వెళ్లిపో, నాయనా! కాని ఇక్కడ చూసిన విష యాలు మాత్రం నీ భార్యకు చెప్పు!" అన్నది రూపధరుడి తల్లి. — (ఇంకాఉంది)



# అసలు సంగతి

రంగాపురం జమీందారు దగ్గర వీరయ్య అనే పనివాడుండేవాడు. దివాణంలోని కచ్చేరీ గదిలో వున్న బల్లలూ, ఆసనాలూ రోజూ దులపడం, గోడలకు బూజులు పట్టకుండా చూడడం, వాడి పని. అయితే, వాడు ఈ పనుల్లో తగినంత శ్రద్ధ చూపేవాడు కాదు. కానీ జమీందారు తాంబూలసేవనం కోసం ఉపయోగించే నగిషీల వెండి తమలపాకులపెట్టెను మాత్రం, రోజూ తళతళా మెరిసేలా శుభ్రపరిచి వుంచేవాడు.

ఇది గమనిస్తూ వస్తున్న జమీందారు, ఒకనాడు వాణ్ణి పిలిచి, "ఒరే, వీరయ్యా! కొంతకాలంగా నీలో బద్ధకం పెరిగిపోతున్నట్టున్నది. కచ్చేరీ గదిని పరిశుభ్రంగా వుంచడం లేదు. అయితే ఒక సంగతి, నా వెండి తమలపాకులపెట్టె విషయంలో మాత్రం చాలా శ్రద్ధ తీసుకుంటున్నావు. ఇది నాకు చాలా సంతోషంగా వున్నది. నిన్ను మెచ్చుకోక తప్పదు," అన్నాడు.

అందుకు వీరయ్య వినయంగా, "అయ్యా, ఇందులో తమరు నన్ను మెచ్చుకోవలసిందేముంది? తమతో పాటు నేనూ, ఆ పెట్టెలో వున్న తమలపాకులను ఉపయోగించుకుంటున్నాను. అటువంటప్పుడు దాన్ని, ఆ మాత్రం శ్రద్ధగా శుభ్రపరచకపోతే, ఏం బావుంటుంది!" అన్నాడు.

అసలు సంగతి తెలుసుకున్న జమీందారు, ఆ వెండి తమలపాకుల పెట్టె వీరయ్య కంటబడకుండా జాగ్రత్తపడ్డాడు.

— ఎస్. శివనాగేశ్వరరావు






# మహిమగలఅద్దం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి,చెట్టుపైనుంచిశవాన్నిదించిభుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఏ మహిమగల అపూర్వవస్తువుల్ని ఆశించి,ఈశ్మశానంలో పడరాని పాట్లు పడుతున్నావో నాకు అర్థం కావడం లేదు. అపూర్వమైన దివ్యవస్తువులు కూడా, ఒక్కొక్కసారి తమ మహిమలను కోల్పోయే అవకాశమున్నది. ఇందుకు నిదర్శనంగా, ఒక మహిమగల అద్దాన్ని పొంది కూడా, దానివలన ఆశించిన ప్రయోజనాన్ని సాధించలేక విఫలుడైన ఒకరాకుమారుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

నైమిశారణ్య ప్రాంతంలో జయేంద్రుడనే ముని నివసించేవాడు. సకలశాస్త్ర పారంగతుడైన ఆయన వద్దకు, ఎందరో యువకులు వచ్చి శిష్యులుగా చేరేవారు.సింహపురి యువ

## బేతాళ కథలు



రాజు హిమదత్తుడు వారిలో ఒకడు. హిమద త్తుడునాలుగేళ్ళపాటుజయేంద్రుడిఆశ్రమంలో వుండి సకల విద్యలూ అభ్యసించాడు. ఇక వీడ్కోలు సమయం ఆసన్నమయింది. ఆ సమయంలో తన శిష్యులకు, వాళ్ళ వాళ్ళ యోగ్యతను బట్టి, జయేంద్రుడు ఏదో ఒక కానుక ఇస్తూండేవాడు.

ఆయన ఆప్యాయంగా హిమదత్తుడి తల నిమిరి, "నాయనా, నేటితో నీ విద్యాభ్యాసం పూర్తయింది.సింహపురి భావిమహారాజు వైన నీకు ఉపకరించగల ఒక కానుకను ఇవ్వదల చాను,"అని,తాటాకుల బుట్టలో నుంచి వల యాకారంలో వున్న ఒక దంతపు అద్దాన్ని బయటికి తీసి, "ఇది మహిమగల అద్దం! దీని ముందు నిలబడిన వ్యక్తిగురించి ఎటు వంటి సమాచారాన్నయినా, ఈఅద్దం అందివ్వ గలదు. బుద్ధికుశలతతో ఈ అద్దాన్ని ఉపయో గించి ప్రయోజనాన్ని పొందు. సమర్థుడైన పాలకుడుగా పేరు తెచ్చుకో. నీకు అవసరం లేదనుకున్ననాడు, ఈ మహిమగల అద్దాన్ని నాకు తిరిగి ఇవ్వు," అని చెప్పాడు.

హిమదత్తుడు, గురువుకు తన కృతజ్ఞత చెప్పుకుని, సింహపురికి తిరిగి వచ్చిన కొంత కాలానికి రాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు.

ఒకనాడు సింహళదేశం నుంచి వీరభూపతి అనే మల్లయోధుడు,ధీరసింహుడు అనే ఖడ్గ విద్యానిపుణుడు, భూపాలవర్మ అనే మేటివిలు కాడు సింహపురికి వచ్చారు. వాళ్ళు, రాజు హిమదత్తుడి దర్శనంచేసుకుని,"మహారాజా, మాముగ్గురిలో ఎవరు అధికులో, ఇంతవరకూ ఎవరూ తేల్చి చెప్పలేక పోయారు. మీవద్ద ఒక మహిమగల అద్దం వున్నదనీ, దాని సహా యంతో మీరు ఎన్నో జటిల సమస్యలను చిటికెలో పరిష్కరిస్తున్నారనీ విని, ఎంతో ఆశతో వచ్చాం. మా వివాదాన్ని కూడా అద్దం సహాయంతో పరిష్కరించండి!" అని కోరారు.

ఆతర్వాతయుద్ధవిద్యలలోవాళ్ళ సామర్థ్యం అపూర్వం అయిందని,వాళ్ళప్రదర్శనను చూసి హిమదత్తుడు గ్రహించాడు. ఆ ముగ్గురు వీరు లనూ అద్దం ముందు నిలబెట్టి, "మహిమ గల అద్దమా! ఈ ముగ్గురు వీరులలో మహా వీరుడెవరో తేల్చి చెప్పు!" అన్నాడు.

అద్దంలో నుంచి ఎటువంటి సమాధానం రాలేదు. హిమదత్తుడు నివ్వెరపోయాడు. రెండు, మూడుసార్లు అడిగి చూసినా ఫలితం లేక పోయింది. అద్దం కూడా తమ సమస్యను పరిష్కరించడంలో విఫలమైనందుకు విచారిస్తూ, ఆ ముగ్గురు వీరులూ వెళ్ళిపోయారు.

కొన్నాళ్ళు గడిచాక కోసలదేశం నుంచి ధూమకేతు, వజ్రబాహు అనే మల్లయోధులు హిమదత్తుడి దగ్గరకు వచ్చారు. వాళ్ళది కూడా తమ ఇరువురిలో ఎవరు గొప్పఅన్న సమస్యే. ఎన్నిసార్లు ఆ ఇద్దరూ మల్లయుద్ధ పోటీలలో పాల్గొన్నా, ఇద్దరూ సమాన ఉజ్జీలుగా నిలబడడమే అందుకు కారణం.

హిమదత్తుడు సభ తీర్చి గత అనుభవం మూలంగా, అద్దం మహిమను సంశయిస్తూనే, "మహిమగల అద్దమా! ఈ ఇద్దరిలో మేటి ఎవరో చెప్పు?" అని అడిగాడు.

మరుక్షణం అద్దంలో నుంచి, "వజ్రబాహు!" అన్న సమాధానం వచ్చింది. అద్దం తన మహిమను కోల్పోనందుకు ఆనందపడుతూ, హిమదత్తుడు, "వజ్రబాహు, ధూమకేతుకంటే ఏ విధంగా మేటి?" అని ప్రశ్నించాడు.

"ఒక మాంత్రికుడు ఇచ్చిన తాయెత్తును భుజానికి కట్టుకోవడం వల్ల, ధూమకేతుకు మల్లయుద్ధ పోటీలలో అపజయం అన్నది లేకుండా పోయింది!" అని అద్దం జవాబిచ్చింది.

ఈ మాటలు వింటూనే, అద్దం ముందు నిలబడి వున్న ధూమకేతు మొహం వెలవెల



బోయింది. వజ్రబాహు కోపంతో పళ్ళు నూరి ధూమకేతుడు భుజానికి కట్టుకుని వున్న తాయెత్తును ఊడ బీకి దూరంగా విసిరివేశాడు.

అప్పటికప్పుడే వజ్రబాహు, ధూమకేతుల మధ్య మల్లయుద్ధం పోటీ ఏర్పాటు చేశాడు హిమదత్తుడు. అద్దం మాటలు అక్షరాలా నిజమని నిరూపిస్తూ వజ్రబాహు, తన వజ్రఘాతాల వంటి పిడిగుద్దులతో ధూమకేతును నిమిషాలలో మట్టికరిపించాడు.

రత్నగిరి, వజ్రగిరి అనేవి, సింహపురికి ఇరుగుపొరుగున వున్న సామంతరాజ్యాలు. రత్నగిరి రాకుమార్తె విజయమాధవి, వజ్రగిరి రాకుమార్తె పూర్ణబిందు – ఇద్దరూ జగదేక సుందరులని వినివున్న రాజు హిమదత్తుడు,



వారిరువురి చిత్రపటాలను తెప్పించి చూశాడు. అందచందాల్లో ఎవరిప్రత్యేకత వారిదే. అందు వల్ల, హిమదత్తుడు ఇద్దరిలో ఎవరు అందగత్తో తేల్చుకోలేకపోయాడు. చివరకు అతడు వారి తండ్రులను కుమార్తెలతో పాటు సింహపురికి రావలసిందిగా ఆహ్వానాలు పంపాడు.

మర్నాటికల్లా సామంతరాజులిద్దరూ, రా కుమార్తెలతో సింహపురికి వచ్చారు. హిమ దత్తుడు వారికిరాజప్రాసాదంలోవిడిది ఏర్పాటు చేసి, ఒకనాటి ఉదయం సామంతరాజులను కలుసుకుని, "మీరు నామాట మన్నించి వచ్చి నందుకు కృతజ్ఞుణ్ణి. మిమ్ములను ఆహ్వానిం చిన కారణం, ఈసరికి మీరు ఊహించేవుం టారు. యువరాణులు విజయమాధవి, పూర్ణ బిందులలో ఎవరు ఎక్కువ సౌందర్యవతో – నేను చిత్రపటాలు చూసి నిర్ణయించుకోలేక పోయాను. యువరాణులిద్దరూ నా ఎదుటనే వున్నా, ఇప్పుడూ నేనేనిర్ణయానికీ రాలేకపోతు న్నాను. ఇందువల్ల, ఈ సమస్యను పరిష్కరించే బాధ్యతను, నా మహిమగలఅద్దానికి అప్పజెబు తున్నాను. యువరాణులిద్దరూ అద్దం ముందు నిలబడితే, అద్దం ఎవరు ఎక్కువ సౌందర్య రాశో ఇట్టే తేల్చేస్తుంది!" అన్నాడు.

పూర్ణబిందు వెంటనే, తానీ పోటీకి సిద్ధం అన్నట్లు మహిమగల అద్దం ముందు నిల బడింది. కాని,విజయమాధవి చిన్నగా నవ్వి, "యువకుడైన రాజుగారు అంధుడని, నాకి ప్పుడే తెలిసింది. అలాంటి వారిని పెళ్ళాడడం, నాకిష్టం లేదు. కాబట్టి, సౌందర్య నిరూపణకు నేను అద్దంముందు నిలబడను," అన్నది.

సలక్షణంగా నవమన్మథుడిలా వున్న హిమ దత్తుణ్ణి, తన కుమార్తె అంధుడన్నందుకు, ఆయన తన కుమార్తెకు ఎలాంటి శిక్ష విధి స్తాడో అని, విజయమాధవి తండ్రి వణికి పోయాడు.

హిమదత్తుడు, విజయమాధవి మాటలకు మొదట ఆగ్రహించినా, కొద్దిసేపటికి ఏదో అర్థమైనట్లు తల పంకించి నవ్వుతూ, విజయ మాధవి తండ్రితో, "నాకు మీ కుమార్తెన చ్చింది. ఆమెకు కూడా నేను నచ్చిన పక్షంలో వెంటనే వివాహానికి ముహూర్తం పెట్టించండి!" అన్నాడు.

హిమదత్తుడి నిర్ణయం రాకుమార్తెల తండ్రు లతో పాటు, అక్కడ వున్న రాజోద్యోగులను కూడా చాలా ఆశ్చర్యపరిచింది. తర్వాత కొద్ది రోజులలోనే హిమదత్తు, విజయ మాధవిల వివాహం వైభవంగా జరిగింది.

ఒక నెల గడిచాక, ఒకనాడు రాజభవన కావలిభటుడు భద్రుడనే వాడు, విజయ మాధవి నగల పేటిక మీద వుంచిన చంద్ర హారాన్నిదొంగిలించి,ఉద్యానవనంలోనిఅశోక వృక్షంతొర్రలో దాచాడు. దొంగతనం విషయం సద్దు మణిగాక, దానిని ఇంటికి తీసుకుపోదా మని వాడి ఆలోచన.

అయితే, భద్రుడు హారాన్ని చెట్టుతొర్రలో దాచడం మల్లిక అనే దాసి చూసింది. భద్రుడు అక్కడి నుంచి వెళ్ళిపోగానే, అది హారాన్ని తీసుకుని ఇంటిదారి పట్టింది.

ఆ తర్వాత కొంతసేపటికి, రాణి విజయ మాధవి చంద్రహారం కనబడకపోవడంతో ఆ సంగతి భర్తకు చెప్పింది. హిమదత్తుడు, ఆ హారాన్ని దొంగిలించిన వాళ్ళు అంతఃపుర దాసీలో, కాపలాభటులో అయి వుంటారని ఊహించి, వాళ్ళందర్నీ పిలిపించి, అద్దం ముందు ఒక్కొక్కరినే నడవమని ఆజ్ఞాపించి, "మహిమగల అద్దమా! నీ ముందు నడిచి పోయే వారిలో చంద్రహారం దొంగ ఎవరో చెప్పు," అన్నాడు.

భటులు,దాసీలు నిలబడిన వరస నెమ్మ దిగా అద్దం ముందు నుంచి కదల సాగింది.



మల్లిక తెలివిగా భద్రుడి వెనక నిలబడింది. తన వంతు వచ్చేసరికి భద్రుడికి ముచ్చె మటలు పట్టాయి. అంతలో అద్దం, "భద్రుడు దొంగ!" అన్నది.

అది విని మల్లిక, "అమ్మయ్య, గండం గడిచింది!" అన్నట్టు గుండెలమీద చెయ్యి వేసుకోవడం, విజయమాధవి కంటబడింది. ఆమె వెంటనే మల్లికనుబంధించమని, భటు డొకణ్ణి ఆజ్ఞాపించింది.

"ఇదేమిటి, మాధవీ! హారం దొంగ భద్రు డని అద్దం చెప్పిందిగదా. మల్లిక నెందుకు బంధించడం?"అన్నాడు హిమదత్తుడు .

"ఇందులో మల్లిక ప్రమేయంకూడా వున్న దని, నా అనుమానం!" అన్నది విజయమాధవి.



అప్పుడు, హిమదత్తుడు గద్దిస్తూ ప్రశ్నించిన మీదట మల్లిక, అతడి పాదాల మీద పడి జరిగిందంతా చెప్పి, ఇంటికి పోయి హారాన్ని తెచ్చి అతడికిచ్చింది. హిమదత్తుడు హారాన్ని విజయమాధవి మెడలోవేసి,ఆమె సునిశిత పరిశీలనాదృష్టిని అభినందించాడు.

తర్వాత అతడు కొద్దిసేపు మౌనంగా వుండి, "ఈ మహిమగల అద్దంవల్ల మేలుతో పాటు కీడూ జరిగే అవకాశముంది. దీని ప్రయోజనం పరిమితమని ఇప్పటికే రుజువయింది. దీన్ని ఈ రోజే మా గురువుగారికి తిరిగి ఇచ్చి, ఆయన ఆశీర్వాదం పొంది వస్తాను," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ముని జయేంద్రుడు, హిమదత్తుడికిచ్చిన మహిమ గల అద్దం కొన్ని సందర్భాలలో సమాధానం చెప్పలేక పోవడం, దాని మహిమ విషయంలో సందేహం కలిగిస్తున్నది. ముగ్గురు వీరులలో మేటి ఎవరో తేల్చి చెప్పడంలో అద్దం విఫల మవడమే ఇందుకు నిదర్శనం. అయితే, మల్లయుద్ధ వీరులు వజ్రబాహు, ధూమకేతుల విషయంలో, వీరుడెవరో నిర్ణయించి అద్దం తన మహిమను చాటుకోవడం చిత్రంగా వున్నది.

ఇక రాకుమార్తెల సౌందర్య పరీక్ష విష యానికొస్తే – విజయమాధవి అద్దం ముందు నిలబడటానికి ఎందుకు నిరాకరించిందో అంతుబట్టదు. బహుశా తాను రాకుమారి పూర్ణబిందుతో పోటీపడి నెగ్గలేనన్న భయం వల్ల కావచ్చు! అంతవరకు బాగానే వుంది. కాని, ఏ అంగవైకల్యమూ లేని – ఎంతో స్ఫురద్రూపి అయిన హిమదత్తుణ్ణి అంధుడని హేళన చెయ్యడం అవివేక లక్షణం కాదా? అలాంటి దాన్ని జీవితభాగస్వామిని చేసుకున్న హిమదత్తుణ్ణి మూర్ఖుడనడం తప్పవుతుందా?

మహిమగల అద్దంవల్ల, మేలుతోపాటు కీడూ జరుగుతుందని హిమదత్తుడు భావించ డమేమిటి? అతడా నిర్ణయానికి రావడానికి తగు హేతువేమైనా వున్నదా? ఆఅద్దాన్ని తన గురువుకు ఇచ్చివేయాలనుకోవడం తెలివి మాలిన పని కాదా? ఈ సందేహాలకు సమా ధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికివిక్రమార్కుడు, "మునిజయేంద్రుడు, హిమదత్తుడికిచ్చిన అద్దం మహిమగలదన డంలో సందేహానికి తావులేదు. అయితే, ఆ మహిమకు కొన్నిపరిమితులున్నమాట కూడా నిజం. సింహళం నుంచి వచ్చిన వీరభూ పతి,ధీరసింహుడు,భూపాలవర్మ ఏమాత్రం పొంతనలేని విభిన్న యుద్ధవిద్యలలో నిపు ణులు. కాబట్టి, వారి మధ్య పోటీ సమన్వయం లేని దవుతుంది. ఈ కారణంవల్లనే అద్దం ముగ్గురు వీరులలో ఎవరు మేటి వీరుడో తేల్చలేక మౌనం వహించింది. ఇక వజ్ర బాహు, ధూమకేతు ఒకే యుద్ధవిద్యలో నిపు ణులు కాబట్టి, అద్దం వాళ్ళలో ఎవరు అధి కులో చెప్పగలిగింది.

పోతే, రాకుమారి విజయమాధవి అద్దం ముందునిలబడడానికినిరాకరించిన కారణం, తను సౌందర్య పరీక్షలో నెగ్గలేనేమో అన్న భయంతో కాదు. వధువులు ఎదురుగా నిల బడి వుండగా, వారి సౌందర్యాన్ని నిర్ణయించే బాధ్యత హిమదత్తుడు అద్దానికి అప్పగిం చడం, ఆమెకు ఆగ్రహకారణమైంది. అందు వల్లనే ఆమె, హిమదత్తుణ్ణి అంధుడన్నది. ఆ మాటల వెనుక వున్న వాస్తవాన్ని గ్రహించే హిమదత్తుడామెను పరిణయమాడాడు.

మహిమగల అద్దానికున్న పరిమితుల్ని పసిగట్టి, మల్లికవంటి దాసీ కూడా నేరం చేసి తప్పించుకోగలిగింది. విజయమాధవి సూక్ష్మపరిశీలన వల్లనే ఆమె పట్టుబడింది. ఇది గ్రహించే హిమదత్తుడు, అద్దంవల్ల ఒక్కొక్కసారి అనర్థాలు కూడా జరిగే అవకాశ ముందని భావించాడు. మహిమగల సాధనాల కంటే, మానవ మేధస్సును ఉపయోగించి సమస్యలను పరిష్కరించడం రాజ్యపాలకుడికి అవసరమని గ్రహింపుకు వచ్చి, దాన్ని తిరిగి మునికి ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు. ఇదిఎంతో సముచితమైన నిర్ణయం. ఇందులో హిమదత్తుడి వైఫల్యం అంటూ ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]



# పనిదొంగ

సముద్ర తీరానగల మయూరిపురంలో, మణిగుప్తుడనే ఓడల వ్యాపారి వుండేవాడు. ఆయన వద్ద వ్యాపారానికి సంబంధించిన లెక్కలూ అవీ చూసేందుకు, చాలామంది నౌకర్లుండేవారు. వాళ్ళల్లో కొందరు పని ఎగ్గొట్టి, కబుర్లతో కాలం గడిపేవారు. నౌకర్లలో కిరీటి అనేవాడు మాత్రం, తన పనిని శ్రద్ధగా చేసేవాడు. అంతేకాక, ఇతరులు చేయవలసిన పనులనుకూడా, తన భుజాల మీద వేసుకుని పూర్తి చేస్తూండేవాడు.

మణిగుప్తుడికి, నౌకర్లలో కొందరు పనిమీద శ్రద్ధ చూపడం లేదని తెలిసి, "నేనంతా గమనిస్తున్నాను, మీ ధోరణి మార్చుకోకపోతే, 'పనిదొంగ' అన్న బిరుదుతో సత్కరిస్తాను," అని హెచ్చరించాడు.

ఈ హెచ్చరికవల్ల, కొందరు నౌకర్లు తమ ధోరణి మార్చుకున్నారు. అలా మారనివాళ్ళ పనులను, ఎప్పటిలా కిరీటి పూర్తిచేస్తున్నాడు.

కొద్ది రోజుల తర్వాత మణిగుప్తుడు, నౌకర్లందర్నీ పిలిచి, "మీలో అసలు పనిదొంగను గుర్తించాను. పనిదొంగ, అన్న బిరుదుకు అర్హుడు కిరీటి. పని ఎగ్గొట్టి తిరిగే వాడే పనిదొంగ కాదు! ఒకరు చేయవలసిన పనిని, వాడి దగ్గర నుంచి దొంగిలించి, తన భుజాన వేసుకునే, కిరీటిలాంటివాడూ పనిదొంగే!" అన్నాడు.

ఇది జరిగాక, కిరీటి తన వైఖరి మార్చుకున్నాడు. దానితో మిగతా నౌకర్లు కూడా బద్ధకం వదిలించుకుని, తమ తమ పనులను సక్రమంగా చేయసాగారు. —"శివజ్యోతి"



సముద్రతీర ప్రయాణాలు : 1

# కచ్ & సౌరాష్ట్ర

రచన : మీరా నాయర్ ❖ చిత్రాలు : గోప్ కుమార్

ప్రపంచంలో సుదీర్ఘమైన సముద్రతీరాలుగల దేశాలలో భారతదేశం ఒకటి. మనకు 7,500 కి.మీ. కన్నా ఎక్కువ పొడవు గల సముద్రతీరం ఉన్నది. ఈ సముద్రతీరం పొడవునా సున్నపురాయి నిటారు గుట్టలూ, మడుగులూ, సరస్సులూ, మైళ్ళ కొలది ఇసుక తీరాలూ, చారిత్రక నిర్మాణాలూ, పురాతన ఆధునిక నగరాలూ, ఓడరేవులూ, మత్స్యకారుల గ్రామాలూ ఉన్నాయి.

మన తీర ప్రయాణం గుజరాత్‌లోని కచ్ ప్రాంతం నుంచి ప్రారంభమవుతుంది.

కచ్‌కితూర్పుగానూ,ఉత్తరదిశలోనూ ఉప్పు చేరులతో నిండిన నిర్మానుష్యమైన'రాణ్ ఆఫ్ కచ్' ఎడారి విస్తరించి ఉన్నది.

శీతాకాలంలో సుదూర ప్రాంతాల నుంచి పక్షులు రావడంతో ఈ ప్రాంతంలో సందడి ప్రారంభమవుతుంది.

మధ్యఆసియాలోని కొన్ని ప్రాంతాల నుంచి, అక్కడి భయంకరమైన చలి బాధ నుంచి తప్పించుకోవడానికి ఫ్లెమింగో వంటి పక్షులు కొన్ని ఇక్కడికి వలస వస్తాయి. మన దేశంలో





అడవి గాడిద

ఒక్క రాణ్‌ప్రాంతంలో మాత్రమే ఈనాటికీ ఫ్లెమింగో పక్షులు గుడ్లుపెట్టి పొదగడం చూడవచ్చు.

ఈ ప్రాంతానికి మాత్రమే ప్రత్యేకమైనవి లేత ఎరుపు ఊదారంగు 'ఘోర్‌ఖర్' అనే అడవిగాడిదలు. వీటికి ఎటు వంటివాతావరణాన్నయినా తట్టుకుని బతకగల శక్తి ఉన్నది. వీటి శరీరకణాలు నీటిని అంత సులభంగా కోల్పోవు. తమ శరీరాలలో నీటిని చాలాకాలం నిలువ ఉంచుకుంటాయి. ఈ అడవిగాడిదలరక్షణకోసం 1973వసం॥లో ఇక్కడ 4,840 కి.మీ. విస్తీర్ణంతో ధంగాధ్రా జంతుశరణాలయం ఏర్పరచారు.

ఎంతో ప్రశాంతంగా,నిర్జనంగా ఉన్న ఈ ప్రాంతం 1965వ సం॥ ఇండియా—పాకిస్తాన్ యుద్ధ కాలంలో ముఖ్యమైన సైనిక చర్యలకు కేంద్రంగా మారింది.

కచ్ సముద్రతీరంలో మాండ్వీ, ముంద్రా, జఖావ్, లఖ్‌పత్, కోటీశ్వర్, కాండ్లా మొదలైన ఓడరేవులు ఉన్నాయి. వీటిలో మాండ్వీ ప్రధానమైన ప్రాచీన ఓడరేవు. మలబార్ ప్రాంతం నుంచి వచ్చేఏలకులు, మిరియాలు,అల్లం,ధాన్యాలు మొదలైన వాటిని ఓడలలో మస్కట్, ఆఫ్రికాతీరాలకుఎగుమతిచేసి,అక్కడి నుంచి ఖర్జూరం, ప్రత్తి,వస్త్రాలు, చక్కెర, నూనెలు, ఖడ్గమృగచర్మం, పటికారం మొదలైన వాటిని దిగుమతి చేసుకునేవారు. ఈ ఓడలు తీరాన్ని సమీపించే ప్పుడు మాండ్వీలోనివర్తకప్రముఖులుఉత్సాహంగా కాంతిస్తంభం పక్కన ఉన్న 'పందాలశిఖరం' మీదికి వెళ్ళి, ఎవరి ఓడ ముందుకనిపిస్తుందో అని పందాలు కాచేవారు!

అయినప్పటికీ, వాయవ్య భారత దేశానికి సముద్రద్వారంగా ప్రసిద్ధిగాంచింది మాత్రం కాండ్లా ఓడరేవు. ఇది ఒక ప్రకృతిసిద్ధమైన ఓడరేవు. 1955వసం॥లో ఇక్కడ ఓడరేవు నిర్మాణం జరిగింది. కచ్ మహారాజా మూడవ మహారావల్ ఖెంగర్జీ అవిరళ కృషిఫలితంగా ఈ ఓడరేవు నిర్మాణం జరిగింది. ఇది మనదేశంలోని మొట్టమొదటి 'స్వేచ్ఛా వర్తక మండలం'. కాండ్లా సమీపంలోనే ఆసియాలోని అతిపెద్ద ఉప్పుకర్మాగారాలు ఉన్నాయి.



ద్వీపకల్పానికిపశ్చిమాగ్రంలో ద్వారక ఉన్నది. శ్రీకృష్ణుడు యాదవుల కోసం నిర్మించినద్వారకానగరం సముద్ర గర్భంలో కలిసిపోయిందనిచెబుతారు. సముద్రం 12 యోజనాల విస్తీర్ణంగల భూమిని నగర నిర్మాణం కోసం శ్రీకృష్ణుడికి ఇచ్చిందనీ, ఆయన

ద్వారకలోని దేవాలయం



నిర్యాణానంతరం ఆ స్థలాన్ని మళ్ళీ సముద్రం ఆక్రమించిందనీ పురాణ గాథ చెబుతుంది. తీర సమీపంలో నగరం ఉండేదనడానికి సాక్ష్యాధారాలుగా తమ పరిశోధనలలో కొన్ని శిథిలాలు బయటపడ్డాయని ఇటీవల సముద్ర పురాతత్వ శాఖ తెలియజేయడం ఇక్కడ చెప్పుకోతగ్గ ఆసక్తికరమైన విషయం.

మహాత్మాగాంధీ జన్మస్థానమైన పోర్‌బందర్ పట్టణం సోమనాథ్ రోడ్డు మార్గంలో ఉన్నది. దీనిని సున్నపురాయి నగరం అంటారు. ఇక్కడి కీర్తి మందిర్‌లో గాంధీజీ జన్మించిన గది, నూలు వడికిన గది, ప్రార్థనామం

దపం,గాంధీజీ ఆయుష్కాలాన్ని సూచించే విధంగా నిర్మించిన 79 అడుగులఎత్తయినస్తూపం, గాంధీజీ జీవిత విశేషాలనూ సిద్ధాంతాలనూ తెలియజేసే పాలరాతిఫలకాలుఉన్నాయి.

శ్రీకృష్ణుడు తన మిత్రుడయిన సుధాముడి కోసం నిర్మించిన ప్రాచీన సుధామపురి ఈనాటి పోర్‌బందర్ అని స్థానికులు చెప్పుకోవడం సంప్రదాయం.

ప్రభాస పటాన్‌లో అరేబియా సముద్రానికి అభిముఖంగా సోమనాథ ఆలయం వెలుగొందుతున్నది. దీనిని మనదేశంలోని పవిత్ర ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటిగా చెప్పుకుంటారు.

సోమనాథ ఆలయం

క్రీ॥శ॥ ఒకటవ శతాబ్దంలో ఈ ఆలయ నిర్మాణం జరిగినట్టు చరిత్ర చెబుతున్నది. వివిధ రాజ్యాల రాజులు అందజేసిన కానుకల ద్వారా ఈ ఆలయం సుసంపన్నమయినదిగా రూపొందింది. ఇది మన దేశంలోనే అత్యంత సంపన్నమైన ఆలయంగా కీర్తి గాంచింది. దేవాలయ గర్భగృహంలో వెలిగే దీపాలను నగలతో, మణిమాణిక్యాలతో అలంకరించారు. గుడిగంటను లాగే గొలుసును బంగారంతో తయారుచేశారు. ఆలయంలోని ఈ సంపదే దాని పతనానికి కారణమయింది.గజనీమహ్మదు అనేకసార్లు ప్రయత్నించి ఆఖరికి క్రీ॥శ॥ 1025వ సం॥లో దండెత్తి వచ్చి ఆలయాన్ని దోచుకున్నాడు. అక్కడి బంగారాన్ని, వజ్రవైఢూర్యాలను, మణులుమాణిక్యాలను ఏనుగుల అంబారాల మీద, ఒంటెల మీద, గుర్రాల మీద తరలించుకుని వెళ్ళాడు. ఆ తరవాత గుజరాత్, మాళ్వరాజులు ఆలయాన్నిపునర్నిర్మించారు.ఆ తరవాతి ఏడువందల సంవత్సరాలలో ఆరుసార్లు శత్రువులు ఈ ఆలయం మీద దాడి జరిపి,నాశనం చేసి దోచుకుని వెళ్ళడం జరిగింది. ఈనాటి ఆలయ పునర్నిర్మాణం1951వ సం॥మే 11వ తేదీ పూర్తయింది.స్వతంత్ర భారతదేశ తొలిఅధ్యక్షుడుడా॥ రాజేంద్రప్రసాద్‌ప్రాచీనఆలయపీఠంమీదే జ్యోతిర్లింగాన్ని ప్రతిష్ఠించారు!



# సీసాలో దయ్యం

అనసూయకు కొత్తగా పెళ్ళయింది. భర్త జోగన్న మంచివాడే కానీ, చిన్నతనంలోనే తల్లితండ్రులు పోగా పెంచిపెద్దచేసిన నాయనమ్మ అంటే భక్తితోపాటు ఎక్కడ లేని భయం. ఈ నాయనమ్మ రంగమ్మ పరమ గయ్యాళి.అనసూయ చేత వెట్టిచాకిరీ చేయించేది. అయినా తృప్తిపడక తిట్టడం, అప్పుడప్పుడూ కొట్టడం కూడా చేస్తూండేది.

రంగమ్మ పెట్టే బాధలు భరించలేక అనసూయ ఒకరోజు రాత్రిపూటఆత్మహత్య చేసుకుందామని ఊరిచివర మర్రి చెట్టు వద్దకు వెళ్ళింది. ఆ సమయంలో మాంత్రికుడొకడు అక్కడ దయ్యాల కోసం తచ్చాడుతున్నాడు. వాడు అనసూయను చూసి ఆమె కథ అడిగి తెలుసుకున్నాడు.

అనసూయ, మాంత్రికుణ్ణి, "నా కిక బ్రతకాలని లేదు. సులభంగా ప్రాణంపోయే మార్గం ఏదైనా చెప్పు," అని వేడుకున్నది.

మాంత్రికుడు నవ్వి ఆమెకొక సీసాయిచ్చి. "సీసామూత తెరిస్తే ఒక దయ్యం బయటకు వస్తుంది. ఎంత కష్టమైనపని అయినా చేసి తిరిగి సీసాలోకి వెళ్ళిపోతుంది. నువ్వు మూత పెట్టేసెయ్యి. అలా వందసార్లు నీకు దయ్యం సాయపడుతుంది. ఆ తర్వాత దయ్యానికి విడుదల ప్రసాదించు. ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో. నువ్వు ఇతరులకు కష్టంకలిగించే పని మాత్రం చెయ్యకూడదు," అని చెప్పాడు.

అనసూయ, మాంత్రికుడికి కృతజ్ఞతలు చెప్పుకుని, ఆ సీసా తీసుకుని ఇల్లు చేరింది.

మర్నాడుదయం నిద్రలేస్తూనే రంగమ్మ పెద్దగా కేకలుపెడుతూ, "ఒసే, పాపిష్టిదానా! రేపే పండగ. ఇంతవరకూ ఇంటి బూజులు దులపలేదు. ఇంటికి సున్నాలు వేయలేదు. ఇల్లు అలకలేదు. ఇంటి ముందు ముగ్గులు పెట్టలేదు. ఈ సంవత్సరం మనకేదో అరిష్టం

రాయవరపు ఆదినారాయణరావు

పట్టుకుంటుంది. తొందరగా లేచి ఎంతో కొంత పని చెయ్యి," అని పురమాయించి, తను మళ్ళీ నిద్రపోసాగింది.

అనసూయకు పట్టరాని దుఃఖం వచ్చింది. పండగకు అమ్మానాన్నా వస్తారనీ, వాళ్ళకోసం రకరకాల పిండివంటలు చేయాలనీ అనుకున్నది. కానీ రంగమ్మ చెప్పిన పనులు ఎప్పటికి తెమిలేటట్లు?

అంతలోనే అనసూయకు సీసాలో దయ్యం గుర్తుకు వచ్చింది. ఆమె సీసా మూత తీయగానే దయ్యం బయటకు వచ్చింది. ఆమె దానికి తన గోడు చెప్పుకున్నది.

దయ్యం అనసూయను ఓదార్చి రంగమ్మ చెప్పిన పనులన్నీ చేయడమేకాక, రకరకాల పిండి వంటలు కూడా చిటికెలమీద తయారు చేసి వుంచింది. రంగమ్మ నిద్రలేచేసరికి ఇల్లు అలంకరణలతో మెరిసిపోతున్నది. పిండి వంటల వాసన ఘుమఘుమలాడిపోతున్నది. ఆమె ఇల్లంతా కలయ తిరిగి చూసింది. తర్వాత కడుపు నిండా భోజనం చేసింది. పిండివంటల రుచికి ఆశ్చర్యపోతూ, అనసూయ ఇన్ని పనులెలా చేయగలిగిందా అని కుతూహల పడింది. ఆ రోజుకు అనసూయ నేమీ అనలేదు.

మర్నాడు అనసూయ తల్లిదండ్రులు వచ్చారు. రంగమ్మ వాళ్ళను ఎంతో బాగా ఆదరించి, అనసూయను వాళ్ళదగ్గర ఎంతగానో మెచ్చుకున్నది. రెండు రోజులుండి వాళ్ళు వెళ్ళిపోయారు --- కూతురు అత్తింట్లో సుఖపడుతున్నదన్న సంతృప్తితో!



ఆ తర్వాత రంగమ్మ మళ్ళీ విజృంభించింది. ఉతక వలసిన బట్టలు బోలెడున్నాయట. అనసూయ తల్లిదండ్రులు ఇంటి నిండా చెత్తపోశారట. బట్టలుతకడానికీ, ఇల్లు కడగడానికీ బోలెడు నీళ్ళు కావాలట. అందు కోసం అటకమీంచి గుండిగలుదింపి, నూతి దగ్గర పెట్టి నీళ్ళతో నింపాలట. అనసూయకీ పనులు పురమాయించి రంగమ్మ పొరుగింటి కెళ్ళింది.

ఆమె తిరిగి వచ్చే సరికి అనసూయ, ఆమె చెప్పిన పనులన్నీ చేసేసింది సీసాలోని దయ్యం సాయంతో.

ఇది చూసి రంగమ్మ తెల్లబోయింది. ఉన్నట్లుండి అనసూయ ఇన్ని పనులెలా చేయగలుగుతున్నదో అర్థంకాక ఆమె అక్కసుతో, "నూతి నీళ్ళు ఉప్పగా వుంటాయి. బట్టలన్నీ కాలవనీటిలో జాడించి తీసుకురా!" అన్నది.

వెంటనే సరేనంటూ తలూపింది అనసూయ.

"అలా తలూపడం కాదు. బోలెడు బట్టలున్నాయి. అన్నీ ఒక్కసారి కాలవకు తీసుకెళ్ళ లేవు. రోజంతా పడుతుంది. కాలవకు పరుగు పరుగున వెళ్ళి వస్తూ తొందరగా పని ముగించాలి," అన్నది రంగమ్మ.

అనసూయ నెమ్మదిగా తలూపి, "కాలవ గాలి మలయమారుతంతో సమానంగా వుంటుందని, ఆదిలక్ష్మమ్మగారి కోడలు లక్ష్మీరాజ్యం చెప్పింది. అందుకని బట్టలన్నీ అక్కడే ఆరేసి తెచ్చేదా?" అన్నది.





ఇది వింటూనే రంగమ్మకు మండిపోయి, "అవనీ చెయ్యి. ఎంతబాగా ఆరేశావో కాలవ దగ్గరకొచ్చి మరీచూస్తాను!"అంటూ కబుర్లాడేం దుకు పొరుగింటికి వెళ్ళింది.

అనసూయ సీసాలో దయ్యాన్ని పిలిచింది. దయ్యం ఆమెతో, "నువ్వు కాలవగట్టున కూర్చో. మొత్తం పనులన్నీ నేను చేస్తాను," అన్నది.

సరేనని అనసూయ సంతోషంగా కాలవ దగ్గరకు వెళ్ళింది. దయ్యం అక్కడ పెద్దపెద్ద కర్రలు పాతి, తాళ్ళుకట్టి, ఇంట్లోని బట్టలన్నీ కాలవ నీళ్ళలో శుభ్రంగా జాడించి ఆరవేసింది. మొత్తం పనులన్నీ చిటికెలమీద అయిపోయాయి.

కొంతసేపటికి రంగమ్మ కాలవదగ్గరకు వచ్చి, తాళ్ళకు వేళ్ళాడుతున్న బట్టలుచూసి ముక్కున వేలేసుకున్నది. కానీ ఆమె అనసూయను మెచ్చుకోలేదు. ఆమె దగ్గర మాయలేవో వున్నాయనీ, అందువల్లనే ఎంత కష్టమైన పనులైనా చేయగలుగుతున్నదనీ అనుకున్నది. అయితే, అన్ని మాయలుండీ అనసూయ తనకు అణిగిమణిగి వుంటున్నది కాబట్టి, ఆ శక్తులకు తాను భయపడనవసరం లేదనుకున్నది.

అప్పటి నుంచీ రంగమ్మ, అసాధ్యమైన పనులన్నీ అనసూయకు చెప్పి చేయించుకుంటూ, తను ఎంతో సుఖపడసాగింది.

అలా రెండు నెలలు గడిచేసరికి — అనసూయకు సాయపడేందుకు సీసాలో దయ్యం తొంభై ఎనిమిది సార్లు బయటకు వచ్చింది. ఇక రెండేరెండు సార్లు తనకు సాయపడి, తనదారిన తను వెళ్ళిపోతుంది! ఆ తర్వాత తన కష్టాలు మళ్ళీ మొదలు! ఇలా ఆలోచిస్తూ దుఃఖంతో అనసూయ గదిలో ఒక మూల కూర్చున్నది.

ఇంతలో అటుగా వచ్చిన రంగమ్మ, అనసూయ మీద చిరాకుపడుతూ, "ఏమిటలా తీరిగ్గా కూర్చున్నావు? పెరటి బావి నీళ్ళు ఉప్పగా వుండడంవల్ల, మంచినీళ్ళ కోసం కాలవచుట్టూ తిరగవలసి వస్తున్నది. బావి నీరంతా తోడి మంచినీటితో నింపు. వెళ్ళు!" అన్నది.

రంగమ్మ గదిలోంచి బయటికి పోగానే, అనసూయ సీసాలోని దయ్యాన్ని పిలిచి, రంగమ్మ గొంతెమ్మ కోరిక గురించి చెప్పింది.

దయ్యం విసుగ్గా ముఖం పెట్టి, "నీకోసం ఇప్పటికెన్నో కష్టమైన పనులు చేశాను. నీ కవి చిటికెల మీద జరిగిపోయినట్టు కనబడి నా, నువ్వు పడ్డంత శ్రమ నాకూ వుంటుంది. అయినా నీకు నా మీద జాలి కలగడం లేదు. నానాటికీ మరింత కష్టమైన పనులు చెబుతున్నావు!" అన్నది.

"ఏం చేయను? నాకిలాంటి పనులు ఇష్టంలేదు. కానీ ఆ దుష్టురాలి కారణంగా చెప్పవలసి వస్తున్నది," అన్నది అనసూయ.

"సరే, దీనితో తొంభై తొమ్మిది పనులవు తాయి. ఇంకొక్క పని మాత్రమే నువ్వు నాకు చెప్పాలి. ఆ తర్వాత ఏం చేస్తావు?" అని అడిగింది దయ్యం జాలిగా.

"మళ్ళీ ఆత్మహత్యకు ప్రయత్నిస్తాను," అన్నది అనసూయ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

అప్పుడు దయ్యం ఒక క్షణం ఆలోచించి, "అయితే ఒక పని చెయ్యి. నేను ఎంతో మంచి వాడైన నా మనవడి భార్యను, ఈ రంగమ్మలాగే నానాబాధలూ పెట్టడం వల్లనే, దయ్యాన్నయి నీకు సేవలు చేసుకోవలసి వచ్చింది. ఈ రంగమ్మ కూడా నాలాంటిదే కాబట్టి, మనమొక ఉపాయం పన్నుదాం. ఇంకొకసారి రంగమ్మ నీకు కష్టమైన పని చెప్పగానే నన్ను పిలిచి, ఆవిణ్ణి చంపేయమని చెప్పు. నే నా పనిచేసి, రంగమ్మ దయ్యాన్ని సీసాలో పెట్టి నా దారిన నేను పోతాను. ఆ తర్వాత, ఆ దయ్యం చేత నీ కసి తీరా పనులు చేయించుకోవచ్చు!" అని చెప్పి, క్షణాల మీద నూతి నీటిని మంచినీళ్ళుగా మార్చి సీసాలోకి వెళ్ళిపోయింది.

ఈలోగా అనసూయ ఏం చేస్తున్నదో చూడాలని అటుగా వచ్చిన రంగమ్మ చెవుల్లో, ఈ సంభాషణ పడనేపడింది. దానితో ఆమెకు ఇన్నాళ్ళుగా ఏం జరుగుతున్నదీ అర్థమైంది. అంతే! రంగమ్మ ఆ క్షణం నుంచీ అనసూయకు కష్టమైన పనులు చెప్పలేదు. నూరవపని దొరక్క సీసాలో దయ్యం సీసాలోనే వుండిపోయింది.





# చిలుక జోస్యం

ముద్గలదేశ రాజు, తన కుమార్తె రత్నమాల స్వయంవరానికి, ఆహ్వానాలు అన్ని దేశాల రాజులకూ పంపాడు. ముద్గలకు పొరుగు దేశమే త్రిశాంబి. దాని యువరాజు సందీపుడు. అతడు లోగడ రత్నమాల అందచందాల గురించి వినివున్నాడు. ఆమెతో వివాహానికి ఎదురు చూస్తున్నాడు.

సందీపుడు,తనను రాకుమారితప్పక వరిస్తుందన్న నమ్మకంతో, ఉత్సాహంగా ముద్గల రాజధానికి కాస్త ముందుగానే చేరుకున్నాడు. స్వయంవర ముహూర్తానికి ఇంకా చాలా వ్యవధి వున్నది. వెంటనే వెళ్ళి రాజసభలో ప్రవేశిస్తే, స్వయంవరానికి వచ్చిన ఇతర రాకుమారుల కంటబడడం జరుగుతుంది. అది అతడికి ఇష్టంలేదు. అందువల్ల, అతడు కొంతసేపు విశ్రాంతి తీసుకుని, నగర వీధులలో వింతలూ,విశేషాలూ చూసి వద్దామని బయల్దేరాడు.

సందీపుడు ఒక వీధి వెంట నడుస్తూ, ఒక చోట చిన్న మందిరం బయట వేలాడ కట్టబడిన ఒక చిత్రమైన ప్రకటన చూశాడు. అదేమంటే — చిలుక జోస్యం — ఒక వరహా మాత్రమే!

అతడు ఆ జోస్యం ఏమిటో తెలుసుకుందామన్న కుతూహలంతో, వరహా చెల్లించి, మందిరం లోపలికి వెళ్ళాడు. అక్కడ వేళ్ళాడుతున్న పంజరంలో ఒక చిలుక వున్నది. అది మాటలు నేర్చిన చిలుక.

ఆచిలుక,సందీపుడిని చూస్తూనే, "త్రిశాంబీ రాకుమారులకు స్వాగతం,సుస్వాగతం! మా రాకుమారి రత్నమాల స్వయంవరానికి వచ్చిన మీరు,మాకు ఆప్తులు. మీకు శుభం కలుగుగాక!" అన్నది.

ఆ మాటలు విన్న సందీపుడు తృళ్ళిపడ్డాడు. తనెవరో, ఏ పని మీద వచ్చాడో, ఈ చిలుక ఎలా ఊహించగలిగిందో అతడికి

రామవరపు గణేశ్వరరావు

అంతు బట్టలేదు. సాలోచనగా తాను ధరించిన దుస్తులకేసి చూసుకున్న సందీపుడికి చప్పున ఒక అనుమానం కలిగి, తన విడిదికి చేరుకున్నాడు.

అక్కడ సందీపుడు, తను ధరించిన రాజోచితమైన దుస్తులు విప్పి వేసి, సాధారణ పౌరులు ధరించే దుస్తులు వేసుకున్నాడు. తర్వాత చిలుక వున్న మందిరానికి వెళ్ళి, మళ్ళీ ఒక వరహా చెల్లించి లోపల ప్రవేశించాడు.

చిలుక, అతణ్ణి చూస్తూనే, "త్రిశాంబీ రాకుమారులకు, మరొకసారి ఘన స్వాగతం! మా రాకుమారి రత్నమాల స్వయంవరానికి వచ్చిన మీరు, మాకు ఆప్తులు, మీకు శుభం కలుగుగాక!" అన్నది.

ఇది విన్న సందీపుడికి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. మొదటిసారి తను ధరించిన రాజోచితమైన దుస్తులు చూసి, చిలుక తనెవరైందీ గ్రహించి వుండాలి. మరిప్పుడు తను అతి సామాన్యమైన పౌరుడు ధరించే దుస్తుల్లో వున్నాడే! అయినా చిలుక తనను ఎలా గుర్తు పట్టగలిగింది?

సందీపుడు కొద్దిసేపు ఆలోచించి, ఏదో మంచి ఉపాయం తట్టిన వాడిలా తలాడిస్తూ మందిరం నుంచి బయటకు వచ్చి, దారిలో ఒక చోట క్షుర కర్మ చేయించుకున్నాడు. తర్వాత దాపుల నున్న ఒక దుకాణంలోకి వెళ్ళాడు.

ఆదుకాణంలో రకరకాల దుస్తులు వున్నవి. వాటిల్లో సాధు సన్యాసులు ధరించే దుస్తులు,



సందీపుడిని బాగా ఆకర్షించినై. కాని, సాధారణంగా అలాంటి వాళ్ళు, జోస్యం చెప్పించుకునేందుకు వెళ్ళరు. పగటివేషగాళ్ళ దుస్తులు, అతడికి నచ్చినా అవి తనహోదాను కించపరచగలవన్న భావం కలిగింది. చివరకు బాగా ఆలోచించి, సందీపుడు, పురోహితులు ధరించే దుస్తులు కొని విడిది చేరాడు.

ఈసారిసందీపుడికి,పురోహితుడిలాదుస్తులు ధరించడం కొంత శ్రమ అయింది. అయినా పట్టుదలగా బిళ్ళగోచీతో పంచబిగించి, నుదుటికి ఇంత విభూది దట్టించి, అంగవస్త్రం భుజాన వేసుకుని, నిండు పురోహితుడి వేషంలో చిలుక వున్న మందిరం చేరి, మరొకసారి వరహా చెల్లించి లోపలికి వెళ్ళాడు.

చిలుక, అతణ్ణి చూస్తూనే కిలకిలమని నవ్వి, "త్రిశాంబీ రాకుమారుల పునరాగమనానికి, నా ధన్యవాదాలు! మా రాకుమారి రత్నమాల స్వయంవరానికి, మీరు ఎంతో దూరం నుంచి ఎన్నో ప్రయాసల కోర్చి వచ్చారు. కాని, ఆ స్వయంవర ముహూర్తం ఇంతకు ముందే ముగిసిపోయింది. మా రాకుమారి, విశాఖ రాకుమారుడి మెడలో వరమాల వేసి, అతణ్ణి వరించింది. వచ్చిన పని మరిచి, లేనిపోని కుతూహలం కొద్దీ నా దగ్గరకు వచ్చి అనవసర కాలయాపనతో, అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకున్న వారిలో, మీరు ఆరవ వారు. వారితోపాటు, మీకూ నా హృదయపూర్వక సానుభూతి. అంతేకాక, నా జోస్యం కోసం మూడుసార్లు వచ్చినందుకు కృతజ్ఞతలు!" అంటూ రెక్కలను టపటపలాడించింది.

ఆమాటలతో, సందీపుడికి తనెంత తెలివి మాలిన పనిచేసిందీ అర్థమైంది. తన రాజ్యం నుంచి పనిగట్టుకువచ్చి, రాకుమారి స్వయంవరానికి వెళ్ళకపోవడమే కాక, చిలుకజోస్యం పరీక్షించేందుకు రకరకాల వేషాలు వేశాడని నలుగురికీ తెలిస్తే, తను నవ్వుల పాలు కాక తప్పదు!

సందీపుడు ఇలా ఆలోచిస్తూ, పుట్టెడు దిగులుతో విడిది చేరి, చుట్టుపక్కల ఎవ్వరికీ చెప్పకుండా రహస్యంగా తన రాజ్యానికి బయలుదేరాడు.






దక్షిణ సముద్ర తీరప్రాంతంలో సౌభద్రమనే తీర్థం ఉన్నది. అర్జునుడు దానిలో స్నానం చెయ్యటానికి ఉపక్రమిస్తూండగా, అక్కడ ఉండే బ్రాహ్మణులు అతన్ని వారించి, ఈ విషయాలు తెలిపారు:

ఈ సౌభద్రతీర్థంతోబాటు, పాలోమ, కారండవ, ప్రసన్న,భారద్వాజ తీర్థాలు కూడా ఆ ప్రాంతంలో ఉన్నాయి. నూరేళ్లుగా ఈ అయిదు తీర్థాలలోనూ ఎవరూ స్నానాలు చెయ్యటం లేదు. కావటానికి అవి పుణ్య తీర్థాలేగాని, వాటిలో మొసళ్ళు చేరాయి. వాటిలోకి దిగటం చాలా ప్రమాదకరం.

ఈ సంగతి వినికూడా అర్జునుడు, తాను మొసలికి భయపడి, సౌభద్రతీర్థంలో స్నానం చెయ్యకపోవటం, పౌరుషహీనమనుకున్నాడు. ఇంతవరకూ అతను ఏ ఒక తీర్థాన్నీ విడవకుండా సేవిస్తూ వస్తున్నాడు. అందుచేత ఈ తీర్థంలో కూడా సంకోచించకుండా దిగేశాడు.

నీళ్ళ కదలిక తెలుసుకుని ఆ తీర్థంలో ఉన్న పెద్ద మొసలి గబగబా వచ్చి అర్జునుడి పాదం పట్టుకున్నది. అర్జునుడు దానిని అలాగే ఒడ్డు దాకా ఈడ్చుకు వచ్చి, నీటిలో నుంచి నేల మీదికి విసిరివేశాడు. వెంటనే దానికి మొసలి రూపం పోయి, కుదురైన అందమైన స్త్రీ రూపం వచ్చింది. ఈమార్పు చూసి అక్కడ ఉన్న బ్రాహ్మణులతోపాటు అర్జునుడు కూడా దిగ్భ్రమ చెంది, "ఓసుందరీ, నువ్వు ఎవతెవు? ఏ కారణం చేత మొసలిరూపం ధరించి ఈ మడుగులో ఉన్నావు? ఎలా మొసలి రూపం పోయింది?" అని అడిగాడు.

ఆమె అర్జునుడితో, "నేనొక అప్సరసను, నా పేరు వర్గ. సౌరభేయి, సమీచి, పస, లత అనే నా నలుగురు చెలికత్తెలూ శాపకారణంగా నాలాగే మొసళ్ళుగా మారారు. నాకు శాప విమోచనం కలిగించినట్టే వారికి కూడా కలిగించి, పుణ్యం కట్టుకో," అన్నది.

"మీకు ఈ భయంకరమైన శాపం ఎందుకు వచ్చింది?" అని అర్జునుడు అడిగాడు. దానికి వర్గ తమ కథ ఇలా చెప్పింది:

"మేము అయిదుగురమూ దిక్పాలకుల నగరాలు చూడటానికి బయలుదేరి, అవి చూసుకుంటూ భూలోకానికి వచ్చాం. ఒక వనంలో మాకు ఒక బ్రాహ్మణుడు తపస్సు చేసుకుంటూ కనిపించాడు. అతను ఎంతో అందంగా ఉన్నాడు. దారుణమైన తపస్సులో ఉండి, అగ్నిహోత్రుడిలాగా వెలిగిపోతున్నాడు. అతని తపస్సు పాడుచెయ్యాలని మాకు దుర్బుద్ధి పుట్టింది. అతని ఎదట ఉద్రేకం కలిగించే మాటలాడాం; అతనికి మా మీద అభిమానంకలిగించటానికిగానుచాలాపాటలు పాడాం; రకరకాల నాట్యాలు చేశాం. మేము ఏం చేసినా అతను చలించలేదు. మమ్మల్ని గడ్డిపోచల కన్న హీనంగా చూశాడు. అతనికి మనసు చలించే పనులు చేశాం. అతనికి కోపం వచ్చింది. మమ్మల్ని మొసళ్ళు కమ్మని శపించాడు! మేము వెంటనే అతని కాళ్ళమీద పడి, ఆడవాళ్ళ మీద అంతగా ఆగ్రహించటం అన్యాయమన్నాం. ఇలాటి శాపం అనుభవించటంకన్న చావు మేలన్నాం. అంటే, ఆయన మాకు నూరేళ్ళపాటు మొసలిజీవితం



తప్పదనీ, ఆ తరవాత ఎవరు మమ్మల్ని పట్టుకుని ఒడ్డున పడవేసినా మా శాపం తీరిపోతుందనీ అన్నాడు. అది మొదలు మేమిక్కడ అయిదు తీర్థాలలోనూ మొసళ్ళ రూపంలో ఉన్నాం. నావెంట మిగిలిన నాలుగు తీర్థాలకూ వచ్చి నా చెలికత్తెల శాపం కూడా తీర్చి, ఈ తీర్థా లన్నిటినీ పవిత్రం చెయ్యి."

ఆమెకోరిన ప్రకారంగానే అర్జునుడు మిగిలిన నాలుగు తీర్థాలలోనూ దిగి, అందులో ఉన్న అప్సరసలకు శాపవిమోచనం కలిగించాడు. అటుతరవాత ఆ అయిదు తీర్థాలకూ నారీతీర్థాలనే పేరు వచ్చింది.

అర్జునుడు అక్కడి నుంచి తిరిగి మణిపురానికి వచ్చి,చిత్రాంగదతో కాపురం చేశాడు. కాలక్రమాన చిత్రాంగదకు బభ్రువాహనుడనే కొడుకు కలిగాడు. ఆ పిల్లవాణ్ణి చిత్రాంగద తండ్రికి వంశోద్ధారకుడుగా ఇచ్చేసి, అర్జునుడు, అక్కడికి సమీపంలోనేఉన్న ప్రభాసతీర్థానికి వెళ్ళి, అందులో స్నానం చేసి, ఆ రాత్రి కొద్దిపాటి వర్షం పడుతూంటే, ఒక మర్రిచెట్టు కింద పడుకున్నాడు.

అక్కడ అర్జునుడికి గదుడనే యాదవుడు తటస్థపడి, కృష్ణుడి చెల్లెలైన సుభద్ర అందచందాలను గురించి మాట్లాడాడు. సుభద్ర తిలోత్తమను మించిన అందగత్తె అని అర్జునుడు అదివరకే విన్నాడు. అతనికి ఇప్పుడు ఆ సుభద్రను చూడాలనీ, ఆమెను సాధించు



కోవాలనీ ఆలోచన పుట్టింది. ప్రభాసతీర్థానికి ద్వారక ఏమంత దూరం కాదు. అక్కడికి పోతే కృష్ణుడు కనబడతాడు.

యాదవులకు యతులంటే చాలా భక్తి. అందుచేత అర్జునుడు యతివేషం వేసుకుని ద్వారకకు వెళ్ళటానికి నిశ్చయించాడు. ఈ లోపల,అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ప్రభాస తీర్థంచేరినవార్త వేగుల వాళ్ళ ద్వారా ద్వారకకు చేరింది.కృష్ణుడు అతన్ని చూడటానికి ప్రభాస తీర్థానికి వచ్చి,"ఇదేమిటి, అర్జునా?ఈ మారు వేషం వేశావు దేనికి?" అని అడిగాడు.

అర్జునుడు తన మనసులో ఉన్న కోరికను కృష్ణుడికి చెప్పుకున్నాడు. కృష్ణుడు దాన్ని ఆమోదించి, అర్జునుణ్ణి రైవతకాద్రి మీద



ఉంచటానికి నిశ్చయించి తన వెంట తీసుకు వచ్చాడు. అక్కడ కృష్ణార్జునులు ఆ పగలూ, రాత్రీ కబుర్లతో గడిపారు, సుఖమైన భోజనం చేశారు, నృత్య గాన వినోదాలు అనుభవించారు. మర్నాడు తెల్లవారగానే కృష్ణుడు అర్జునుడికి రైవతకాద్రి మీద అన్ని సదుపాయాలూ ఏర్పాటు చేసి, ద్వారకకు వెళ్ళిపోయాడు.

తరవాత కొద్ది రోజులకే యాదవులు రైవతకాద్రి మీద ఒక గొప్ప ఉత్సవం జరిపారు. ఆ ఉత్సవం చూడటానికి ద్వారక నుంచి వసుదేవుడూ, ఉగ్రసేనుడూ, అక్రూరుడూ, బలరాముడూ,కృష్ణుడూ,ప్రద్యుమ్నుడూ మొదలైన యాదవకుమారులూ; దేవకీదేవీ, రేవతీ, రుక్మిణీ,సత్యభామా, జాంబవతీ మొదలైన అంతఃపుర స్త్రీలూ, సుభద్ర మొదలుగాగల కన్యలూ వచ్చారు. ఆ అందరి మధ్యా తిరిగే సుభద్రను చూసి అర్జునుడు సంతసం చెందాడు. ఉత్సవం ముగియగానే అందరూ ద్వారకకు తిరిగి వెళ్ళిపోయారు.

కృష్ణుడి అనుమతితో అర్జునుడు రైవతకాద్రిని విడిచిపెట్టి, ద్వారకను ఆని ఉన్న ఒక ఉద్యానవనానికి చేరాడు. అక్కడికి వాహ్యాళికి వచ్చే బలరాముడు మొదలైన యాదవులు అర్జునుణ్ణి చూసి, దొంగయతి అని తెలియక, అతనికి నమస్కారాలు చేసి, "తమరు ఏయే పుణ్యతీర్థాలు చూశారు? ఏయే పుణ్య క్షేత్రాలకు వెళ్ళారు? ఇక్కడ ఎంతకాలం ఉంటారు?" అని అడిగారు. అర్జునుడు వారికి తగిన జవాబులిచ్చి, "చాతుర్మాస్యం ఇక్కడనే జరుపుదామనుకుంటున్నాను," అన్నాడు. చాతుర్మాస్యం అంటే ఆషాఢ శుక్లపక్షం నుంచి, కార్తీక శుక్లపక్షందాకా నాలుగు నెలలు జరిపే నిష్ఠ.

ఈ మాటవిని బలరాముడు చాలా సంతోషించి, తన వెంట ఉన్న కృష్ణుడితో, "ఈ యతికి సుభద్ర ఇంటి సమీపంలో ఉన్న పొదరింట్లో వసతి ఏర్పాటు చేతాం. ఏమంటావు?" అన్నాడు.

"ఈ యతి చూడబోతే అందగాడుగా ఉన్నాడు. మన సుభద్రకూడా సౌందర్యవతి. అందుచేత చివరకు ఎలా పరిణమిస్తుందోనని నా భయం!" అన్నాడు కృష్ణుడు.



"అలా అందరినీ సంశయించటం తగదు. ఈ యతికి సుభద్ర మందిరమే సరిఅయినది," అన్నాడు బలరాముడు. కృష్ణుడు తన అన్న మాటతోసివెయ్యటంభావ్యంకాదన్న ధోరణిలో బలవంతాన ఒప్పుకున్నట్టు నటించి,అర్జునుణ్ణి సుభద్ర మందిరం ఆవరణలో చేర్చి, అతని రహస్యాన్ని రుక్మిణీ, సత్యభామలకు మాత్రం తెలిపాడు. తరవాత సుభద్రతో, "అమ్మా, యతినినీతోటలో విడిది చేయించాం. నువ్వూ, నీ చెలికత్తెలూ అతను చెప్పినట్టు వింటూ, అతనికి కావలసిన ఉపచారాలన్నీ చెయ్యాలి. అతని భోజనం, స్నానం విషయంలో అజాగ్ర త్తగా ఉండకు.యతిసేవచేసి యాదవ కన్యలు ఎన్నో శుభాలు పొందారు," అన్నాడు.

కృష్ణుడు చెప్పినట్టుగానే సుభద్ర అర్జునుడికి సమస్త ఉపచారాలూ లోటులేకుండా చేస్తూ వచ్చింది. సుభద్ర అందం చూసి అర్జునుడు పరమానందం చెందాడు. అతని తీర్థయాత్రల గడువు ఎప్పుడో దాటిపోయింది. కాని ఇంద్ర ప్రస్థానికి తిరిగి పోవాలన్న ఆలోచన అతనికి ఏమాత్రమూ లేదు.

అర్జునుడి స్థితి ఇలా ఉంటే, సుభద్ర కూడా అర్జునుడి కోసమే కలవరిస్తున్నది. ఆమెకు అర్జునుడంటే గొప్పభావం కలిగించిన వాడు గదుడనే యాదవుడే. అదీగాక, కృష్ణుడు అర్జునుణ్ణి పదిమందిలోనూ గొప్పగా మెచ్చు కోగా ఆమె విన్నది. యాదవులు తమ పిల్ల లను దీవించేటప్పుడు, "అర్జునుడంత విలు కాడివి కా!" అనటం ఆమెకు తెలుసు. వీట న్నిటి మూలంగా సుభద్ర మనస్సులో అర్జునుడు బాగా స్థిరపడ్డాడు.అందుచేత, ఎవరైనా కురుజాంగల దేశాల నుంచి వచ్చి నప్పుడు ఆమె అర్జునుడి వార్తలు అడిగి తెలుసుకునేది, అతని వర్ణనలు ఎంతో శ్రద్ధగా వినేది.

ఒకనాడు అర్జునుడు ఒంటరిగా ఉన్న ప్పుడు సుభద్ర అతని సపర్యలన్నీ ముగించి, "మీరు ఏ దేశాలు చూశారు? మీకు ఇంద్ర ప్రస్థం తెలుసా? మా మేనత్త కుంతీదేవి క్షేమంగా ఉన్నదా? ధర్మరాజు మొదలైన వారు కులా సాగాఉన్నారా? పెద్ద కళ్ళూ, పొడుగాటి చేతులూ గల అర్జునుడు మీకు

తెలుసా? అతను మహాశూరుడు, పరాక్రమ వంతుడు," అన్నది.

దానికి అర్జునుడు, "ఇంద్రప్రస్థంలో కుంతీ, పాండవులూ, ద్రౌపదీ సుఖంగా ఉన్నారు. వారికి తెలియకుండా అర్జునుడు మాత్రం యతివేషం వేసుకుని, ద్వారకలో సుభద్ర ఎదుట ఉన్నాడు! నేను అర్జునుణ్ణి. నీకు నా పైన గల ప్రేమకంటే నాకు నీపైన ఎన్నోరెట్లు ప్రేమ ఉన్నది. ఒక మంచి రోజున నేను నిన్ను పెళ్ళాడి వైభవంగాఉంటాను," అన్నాడు.

సుభద్ర సిగ్గుపడిపోయి, తల ఎత్తలేదు. అర్జునుడు తన లతాగృహానికి వెళ్ళిపోయాడు.

వారిద్దరి మనస్థితీ గ్రహించి కృష్ణుడు అర్జునుడి సేవలకు రుక్మిణిని నియోగించాడు. అర్జునుణ్ణి ప్రత్యక్షంగా చూసినది మొదలు సుభద్ర పిచ్చి ఎత్తిన దానిలాగా అయిపోయి, నిద్రాహారాలు మానేసింది.

దేవకీదేవి తన కూతురి అవస్థ గ్రహించి, "ఎందుకు కుమిలి పోతావే, పిచ్చిదానా? నీ విషయం మగవాళ్ళతో చెప్పి నీ కోరిక తీరే టట్టు చూస్తాను," అని మాట ఇచ్చింది.

ఆమె సుభద్ర విషయం తనభర్త అయిన వసుదేవుడికి చెప్పింది. ఆయన ఈ సంగతి ఉగ్రసేనుడికీ, అక్రూరుడికీ, మరికొందరు హితులకూ చెప్పి, కృష్ణుడి అనుమతితో, బలరాముడికి తెలియకుండా, పది రోజుల అనంతరం సుభద్రార్జునుల వివాహానికి ముహూర్తం నిశ్చయించాడు. అందుకోసం అంతర్ద్వీపంలో పన్నెండు రోజుల పాటు ఉత్సవం జరపాలని చాటింపు వేయించాడు.

ఈ అంతర్ద్వీపం పది యోజనాల నిడివి గలది. ఈ ఉత్సవం కోసం ద్వారక నుంచి ఆబాలగోపాలమూ ఆ ద్వీపానికి వెళ్ళారు. తన వివాహానికి కృష్ణుడు కూడా దగ్గిర ఉండాలనే ఉద్దేశంతో అర్జునుడు సుభద్రను పురికొల్పికృష్ణుణ్ణి అడిగించాడు; ఆమె కృష్ణుడితో, "అన్నా, నువ్వు కూడా అంతర్ద్వీపానికి పోతే యతిసేవ సాగదు. అందుచేత నువ్వు ఉండిపో!" అన్నది.

దానికి కృష్ణుడు, "ఈసమయంలో యతి సేవకు నువ్వుతప్ప ఇంకెవరూ పనికి రారు," అనితానుకూడాఅంతర్ద్వీపానికివెళ్ళిపోయాడు.



# చందమామ కబుర్లు

## నలబై ఆరేళ్ళే!

మనం నివసిస్తున్న భూమి వయసు 46 సంవత్సరాలే అంటున్నాడు అంతర్జాతీయ నిపుణుడు అన్వర్ ఫాజల్. వినడానికి పిచ్చి ప్రలాపనలా ఉందా? పైకి అలా అనిపించినప్పటికీ, అదేం కాదు. ఈ భూమి ఏర్పడి 46,00 మిలియన్ సంవత్సరాలయిందని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. దీనినే ఆయన తేలికగా గుర్తించడానికి వీలుగా 46 సంవత్సరాలని కుదించి చెప్పాడు. బెంగళూరులో ఇటీవల జరిగిన ఒక సమావేశంలో ఉపన్యసిస్తూ అన్వర్ ఫాజల్ – భూమి 'బాల్యం' 'యువప్రాయం' గురించి మనకేమీ తెలియదు; నిజానికి మనకు తెలిసిందంతా గత నాలుగేళ్ళుగా జరిగినవే. రాక్షసబల్లులు ఒక సంవత్సరం క్రితమే ఉండేవి. ఒక వారం క్రితమే భూమి మంచు యుగం నుంచి బయటపడింది నాలుగుగంటల నుంచే మనుషులు భూమిమీద తిరుగాడుతున్నారు. వ్యవసాయం ప్రారంభమై ఒక గంటే అయింది. పారిశ్రామిక విప్లవం జరిగి ఒక్క నిమిషమే అయింది. గత60 సెకనులలో 500 జాతుల జంతువులు నాశనమైపోయాయి – అని చెప్పి ఆయన తన ఉపన్యాసం ముగించాడు. ఇప్పుడు తెలిసింది కదా నిపుణుడి నలబై ఆరేళ్ళ అంతర్యం?



## మళ్ళీబడికి!

విద్యాభ్యాసం జీవితాంతం కొనసాగుతుందనిఅంటారు. జీవితంలో మళ్ళీ ఎప్పుడో ఒకసారి బడికి వెళ్ళి చదవాలనికాదు దీనికి అర్థం. అయితే దక్షిణ అమెరికా బ్రెజిల్ దేశానికి చెందిన కొందరు ప్రముఖులు నిజంగానే మళ్ళీ బడికి వెళ్ళవలసి వచ్చింది. పలువురు రాజకీయ నాయకులకు చాలినంత రాజకీయ పరిజ్ఞానం, అనుభవం లేకపోవడంతో తమ బాధ్యతలను సక్రమంగా నెరవేర్చలేక పోతున్నారు. ఇటీవల అటువంటి 180 మంది శాసన సభ్యులు, మేయర్లు, కౌన్సిలర్లు – రాజకీయ, సామాజిక, ఆర్థిక విషయాలను బడికి వెళ్ళి మరీ నేర్చుకున్నారు. మనదేశంలో కొత్తగా పార్లమెంటుకు ఎన్నికయిన సభ్యులకు–లోక్ సభ, రాజ్య సభ కార్య కలాపాలకు, సంబంధించిన విషయాలు తెలియజేయడానికి శిక్షణా తరగతులు ఏర్పాటుచేయడం తెలిసిన విషయమే.

## ఉపాధ్యాయుడుగా మారిన విద్యార్థి!

అమెరికా వైమానికదళానికి చెందిన కేప్టన్ స్కాట్ ఓ గ్రేడీ,అమెరికా వైమానికదళ పాఠశాలలో1991వ సం॥ లో విద్యార్థిగా ఉండేవాడు. రెండేళ్ళ క్రితం అతడు శాంతి పరిరక్షక దళంతో బోజ్నియాకు వెళ్ళాడు.అతడు నడుపుతూన్న విమానాన్ని శత్రువులు కిందికి పడగొట్టారు. ఏ మాత్రం పరిచయంలేని వింత పరిసరాల మధ్య పడిపోయిన అతడు ఎన్నో కష్టాలకు ఓర్చుకుని ప్రాణాలు నిలబెట్టుకున్నాడు. ఆరు రోజుల తరవాత అతన్ని సురక్షిత ప్రాంతానికి చేర్చారు. ఇటీవల అతడు తనప్రాణాలు నిలుపుకోవడానికి చేసిన ప్రయత్నాలను, అనుసరించిన పద్ధతులను గురించి వివరించమని అతని వద్దకు 150 మంది ఉపాధ్యాయులు వచ్చారు. వారిలో అతడు చదువుకున్న వైమానిక దళ పాఠశాలకు చెందిన ఉపాధ్యాయులు కూడా ఉన్నారు. ఆ విధంగా అతడు తన ఉపాధ్యాయులకే పాఠాలు నేర్పిన విద్యార్థిగా మారాడు!

# నాగవల్లి

అదృష్టదేవతకు చాలా ఇష్టమైన పుష్పంగా శ్రీవతి పుష్పాన్ని చెబుతారు. దీనినే నాగవల్లి పుష్పం అనికూడా అంటారు. సత్యస్వరూపుడైన మహావిష్ణువుకు ప్రీతిపాత్రమైన తెలుపుగుర్తు ఈ చెట్టులో స్పష్టంగా కనిపిస్తుంది. దీనిని బెంగాలీలో నాగబలి అనీ, తమిళంలో వెళ్లైఇలై అనీ, మలయాళంలో పారాధోలీఅనీ, మరాఠీలో భుట్కేశ అనీ, హిందీలో పెదీనా అనీ అంటారు. వృక్షశాస్త్రం లోదీనిని ముస్సేండా ఫ్రాండోసా అని అంటారు. బాలకృష్ణుడు తిరిగిన ప్రదేశం అని చెప్పుకునే మధుర — భరత్‌పూర్‌ల మధ్య ఉన్న విశాల బృందావన ప్రాంతంలో ఈ చెట్లు విరివిగా ఉన్నాయి. పశ్చిమబెంగాల్‌లోనిడార్జిలింగ్ ప్రాంతంలోనూ పడమటి కనుమలలోని నీలగిరి పరిసర ప్రాంతాలలోనూ ఈ నాగవల్లి చెట్లు ఎక్కువగా కనిపిస్తాయి.

ఆరు మీటర్ల ఎత్తు మాత్రమే పెరిగే ఈ చిన్న చెట్ల ఆకులు ముదురు పచ్చరంగులో ఉంటాయి. పచ్చటి ఆకుల మధ్య తెల్లగా ఒక పెద్ద ఆకు కనిపిస్తుంది. ఇది నిజానికి బాగా పెరిగిన పువ్వు రక్షకపత్రంలోని ఒక దళం మాత్రమే.

ఆకులు జతలు జతలుగా ఒకదాని కొకటి ఎదురెదురుగా ఉంటాయి. 12 సెం.మీ. పొడవుతో అండాకారంలో మొనదేలి ఉంటాయి. మధ్య ఉన్న ఈనె లావుగా రెండు వైపులా స్పష్టంగా కనిపిస్తుంది. ఆకు పై భాగంలో ముదురు పచ్చగానూ, అడుగున అంటే రెండోవైపున లేతపచ్చ రంగుతోనూ ఉంటుంది.

పువ్వుల లోపలి వైపు నారింజ రంగులోనూ, వెలుపలివైపు ఊదారంగులోనూ ఉంటుంది. పుష్ప కోశంలో ఐదుపత్రాలు ఉంటాయి. వాటిలో ఒకటి ఆకులాగా విచ్చుకుని పెద్దగా పెరుగుతుంది. మిగతా పత్రాలు రాలిపోతాయి. ఈ పూలను మాలలు కట్టి పర్వదినాలలో వాకిటి ముందు వేలాడ కడతారు.

వీటి కాయలు అండాకారంలో పచ్చగాఉంటాయి. పండిన తరవాత నలుపు రంగు లోకి మారతాయి. ఈ చెట్ల ఆకులనుంచి వేళ్ళ వరకు ప్రతిభాగమూ ఔషధ గుణాలు కలిగి ఉన్నాయి.



మనదేశపు ఋషులు : 9

# దుర్వాసుడు

త్రిపురాసురుల సంహారం కోసం పరమశివుడు ఒక బాణం సృష్టించి, ప్రాణం పోసి ప్రయోగించాడు. ఆ బాణం రాక్షస సంహారం చేసి తిరిగివచ్చి పసిపాపలా శివుడి ఒడిలో వాలింది. దానిని చూసి ముచ్చటపడిన పరమశివుడు ఆ బాణాన్ని మానవ శిశువుగా మార్చాడు. ఆ శిశువే పెరిగి పెద్దవాడై దుర్వాసమునిగా పేరు తెచ్చుకున్నాడు.

ఆదిలో సంహారం కోసం సృష్టించబడినవాడు కావడం వల్ల, తపస్సంపన్నుడయిన మునిగా మారినప్పటికీ, ఆయనలోని సంహారగుణం ముక్కుమీది కోపంగా కొనసాగుతూనే వచ్చింది. స్వల్ప విషయానికి సైతం అమితాగ్రహం చెందేవాడు. అయితే, కొంతసేపటికి పరిస్థితులు గ్రహించి శాంతించేవాడు.

మన పురాణకథలలో చాలావాటిలో దుర్వాసుడికి సంబంధం ఉన్నది. వాటిలో శకుంతలాదుష్యంతుల కథ అందరికీ తెలిసినదే. కణ్వముని ఆశ్రమంలో పెరిగిన శకుంతల దుష్యంతుణ్ణి రహస్యంగా గాంధర్వ వివాహం చేసుకున్నది. రాజధానికి ఎప్పుడు వచ్చినా స్వీకరించగలనని ఆమెకు మాటఇచ్చి వెళ్ళాడు దుష్యంతుడు. ఒకనాడు దుర్వాసముని కణ్వముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ సమయంలో శకుంతల దుష్యంతుణ్ణి గురించి ఆలోచిస్తూండడం వల్ల, ఆమె ముని రాకను గమనించలేదు. అంతే, తనకు అవమానం జరిగిపోయిందన్న ఆగ్రహంతో దుర్వాసుడు, "నువ్వు ఎవరిని గురించిన ఆలోచనలతో నన్ను నిర్లక్ష్యం చేశావో, వాడే నిన్ను మరిచిపోవుగాక!" అని శపించాడు. తెలియక చేసిన తప్పును క్షమించమని శకుంతల చెలికత్తెలు వేడుకోవడంతో ముని శాంతించి, శాపతీక్షణ్యాన్ని తగ్గించాడు.



శకుంతల రాజధానీ నగరానికి వెళ్ళినప్పుడు దుష్యంతుడు మొదట ఆమెను గుర్తించకపోవడానికీ, ఆ తరవాత కొంతకాలానికి గుర్తించడానికీ దుర్వాసముని శాపమే కారణం!

దుర్వాసుడి ప్రవర్తన మామూలు మనుషులతో మాత్రమే కాకుండా అవతారపురుషులతో సైతం దురుసుగానే ఉండేది. శ్రీకృష్ణుడు ద్వారకను పరిపాలిస్తున్నప్పుడు, దుర్వాసుడు ఒకనాడు ఆయనను పరీక్షించడానికి అక్కడికి వెళ్ళాడు. పాయసం కావాలన్నాడు. రుక్మిణీ కృష్ణులు స్వయంగా పాయసం తయారుచేసి తెచ్చారు. దానిని చూడగానే దుర్వాసుడు, "ఈ పాయసాన్ని నీ శరీరానికి పూసుకో," అని కృష్ణుణ్ణి ఆజ్ఞాపించాడు. కృష్ణుడు మారు మాట్లాడకుండా సంతోషంగా చెప్పినట్టు చేశాడు. దుర్వాసుడు అంతటితో ఆగలేదు. రథం మీద కూర్చుని, గుర్రాలకు బదులు, తానెక్కిన రథాన్ని రుక్మిణీకృష్ణులే లాగాలని ఆజ్ఞాపించాడు. అదే ప్రకారం రుక్మిణీకృష్ణులు, రథాన్ని గుర్రాల్లా లాక్కుంటూ వెళ్ళి దాపులనున్న అరణ్యంచేరగానే దుర్వాసుడు రథం దిగి ఆనంద బాష్పాలతో కృష్ణుణ్ణి కౌగిలించుకుని, "తాపసుల పట్ల నీకున్న గౌరవం, ఓర్పు, వినయగుణం అనన్య సామాన్యమైనవి. పాయసం పూసుకున్న నీశరీరాన్ని ఎటువంటి ఆయుధాలూ గాయపరచలేవు!" అని మెచ్చుకుని, వరమిచ్చి వెళ్ళిపోయాడు!

కృష్ణుడు పాదాలకు మాత్రం పాయసం పూసుకోలేదు. అందుకే, అంతిమ కాలంలో లేడిచెవులని పొరబడి బోయవాడు వేసిన బాణం పాదానికి తగలడంతో కృష్ణుడు ప్రాణాలు విడిచాడు!

# మీకు తెలుసా?

1. మొట్టమొదటి అంతరిక్షగామి ఎవరు?
2. మెక్‌మోహన్ రేఖ అంటే ఏమిటి?
3. తిమింగిలం పరిమాణం ఎంత?
4. ప్రపంచంలో మొత్తం జ్వలిస్తూన్న అగ్నిపర్వతాలు ఎన్ని?
5. భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థను (ఇస్రో) ఎప్పుడు ఏర్పాటుచేశారు?
6. కంగారూ ఎంత దూరం గెంతగలదు?
7. పెన్సిలిన్‌ను కనుగొన్నవారెవరు? ఎప్పుడు?
8. 'జంతర్ మంతర్' అంటే ఏమిటి? ఎక్కడ ఉన్నది?
9. సూర్యుడు తన చుట్టూ ఒకసారి తిరగడానికి ఎంతసేపు పడుతుంది?
10. బ్రహ్మసమాజ స్థాపకుడు ఎవరు?
11. బాడ్మింటన్‌ను ఎప్పుడు మొదట ఆడారు?
12. రవీంద్రనాథ్ టాగూరుకు నోబెల్ సాహితీ బహుమతి ఎప్పుడు లభించింది?
13. గౌతమబుద్ధుడు 2,500 సం॥ పూర్వం తన మత ప్రచారాన్ని ఒక ఉద్యానవనంలో ప్రారంభించారు. అది ఎక్కడ ఉన్నది?
14. ఆకాశవాణిలో 'వివిధ భారతి' వాణిజ్య ప్రసారం ఎప్పుడు ప్రారంభించారు?
15. ప్రపంచంలోనే అత్యధిక కార్మికులు పనిచేసే సంస్థ మనదేశంలో ఉన్నది. అది ఏది?
16. ఢిల్లీలో రాజ్‌ఘాట్‌లో మహాత్మాగాంధీ సమాధి ఉన్నది. కస్తూరిబాయి సమాధి ఎక్కడ ఉన్నది?
17. కట్టకడపటి మొగలు చక్రవర్తి ఎవరు?
18. మన దేశంలో మొట్టమొదటి తపాళాబిళ్ళను ఎప్పుడు విడుదల చేశారు?
19. ప్రప్రథమంగా 'ఆసియా క్రీడలు' ఎక్కడ జరిగాయి? ఎప్పుడు? అప్పుడు ఛాంపియన్‌షిప్ సాధించిన వారెవరు?

## సమాధానాలు

1. జాన్ హెచ్. గ్లెన్.
2. ఇండియాకూ, టిబెట్‌కూ మధ్య ఉన్న ఊహా సరిహద్దు రేఖ.
3. ఆడ తిమింగిలం అన్నిటికన్నా పెద్దది. సుమారు 90 అడుగుల పొడవూ, 100 టన్నుల బరువూ ఉంటుంది.
4. దాదాపు 850.
5. 1969వ సం॥లో.
6. ఒక గెంతుకు 7-9 మీటర్లు.
7. బ్రిటన్‌కు చెందిన అలెగ్జాండర్ ఫ్లెమింగ్. 1928వ సం॥లో.
8. ఢిల్లీలో 1724వ సం॥లో అంబర్ మహారాజా జయ్ సింగ్ నిర్మించిన అంతరిక్ష పరిశోధనాశాల. ఇది ఇప్పుడు ముఖ్యమైన యాత్రాస్థలం.
9. భూమధ్యరేఖ సమీపంలో 25 రోజులు. ధ్రువాల సమీపంలో 33 రోజులు.
10. రాజా రాంమోహన్‌రాయ్.
11. 1870వ సం॥లో. పశ్చిమ ఇంగ్లాండు, గ్లౌజెస్టర్ షైర్‌లోని బాడ్మింటన్ గ్రామంలో.
12. 1913వ సం॥లో. గీతాంజలి కోసం.
13. వారణాసి సమీపంలోని సారనాథ్‌లో.
14. 1957, అక్టోబర్ 3వ తేది.
15. భారతీయ రైల్వే సంస్థ. దాదాపు 20 లక్షల మంది.
16. పూనేలోని ఆగాఖాన్ భవన ప్రాంగణంలో. అక్కడే ఆమె మరణించారు.
17. బహదూర్ షా జాఫర్.
18. 1852వ సం॥లో. స్టాంపును 'షిండే డాక్' అన్నారు.
19. 1951వ సం॥లో ఢిల్లీలో. జపాన్.



# ఉగ్రసేనుడి మూలిక

పూర్వం చందనపురం అనే ఒక పెద్ద ఊరిలో ఉగ్రసేనుడనే మహావీరుడుండే వాడు. కత్తి యుద్ధంలో వాడి కెదురు నిలవగలవాడు, ఈ భూమ్మీద లేడని పేరు. ఎందరో వీరులు వచ్చి వాడిని సవాలు చేసి ఓడిపోతూండేవారు.

ఆ ఊళ్ళోనే మహానందుడనే యువకుడున్నాడు. కత్తియుద్ధంలో ప్రావీణ్యం సంపాదించాలని చిన్నతనం నుంచీ వాడికి మనసు. కానీ ఎవరి దగ్గరచేరి ఎన్ని మెలకువలు నేర్చుకున్నా ఆవిద్యలో ఇంతవరకూ తానోడిపోవడమే తప్ప, ఎప్పుడుగాని ఏ వీరుణ్ణీ ఓడించలేకపోయాడు.

ఇలాంటి పరిస్థితుల్లో, బైరాగి ఒకడు ఒక రోజున మహానందుడింటి ముందు నిలబడి, "కడుపు నిండా అన్నం పెట్టిన వారికి ఎంత కష్టమైన కోరికైనా తీరుస్తాను," అంటూ కేక పెట్టాడు. ఈ కేక విని అంతవరకూ ఎవరూ పట్టించు కోలేదు.కానీ మహానందుడు మాత్రం ఇంటి బయటకు వచ్చి, "ఇతరుల కోర్కెలు తీర్చగలిగిన వాడికి కడుపునిండా అన్నం దొరకదా?" అంటూ కుతూహలంగా నవ్వుతూ అడిగాడు.

దానికి బైరాగి, "మధుర ఫలాలివ్వగల చెట్టుకు గుక్కెడు నీళ్ళు కావాలంటే, మనిషే కదా ఆధారం. మనిషి పళ్ళు చెయ్యలేడు. చెట్టు నీళ్ళు తెచ్చుకోలేదు. మనుషుల్లోకొందరు చెట్లలాంటి వాళ్ళుంటారు. నేనలాంటి వాణ్ణి!" అన్నాడు.

మహానందుడు, బైరాగికి కడుపు నిండా అన్నం పెట్టి, "కత్తియుద్ధంలోనన్ను మించిన వాళ్ళుండకూడదు. అదీ నా కోరిక!" అన్నాడు.

బైరాగి వెంటనే జోలెలోంచి ఒక మూలిక తీసి మహానందుడికిచ్చి, "దీన్ని నమిలి మింగు. నీలో కొత్త శక్తి వస్తుంది. ఆ తర్వాత ఒక్కసారికి ఒక మహావీరుణ్ణి కత్తియుద్ధంలో ఎలాగో అలా ఓడించు. అప్పటి నుంచీ ఆ

'వసుంధర'

వీరుణ్ణి మించిన వాళ్ళను తప్ప, మిగతా అందర్నీ అవలీలగా ఓడించగలుగుతావు," అన్నాడు.

ఒక్కసారి ఉగ్రసేనుణ్ణి ఓడించగలిగితే– కత్తియుద్ధంలో ఉగ్రసేనుణ్ణి మించినవారు లేరు కాబట్టి – ఆ తర్వాత నుంచి తనను ఓడించే వారే వుండరని, మహానందుడనుకున్నాడు. కానీ మొదట ఉగ్రసేనుణ్ణి ఓడించడమెలా?

బైరాగి మహానందుడి సందేహం విని, "నువ్వు స్వయంశక్తితో ఉగ్రసేనుణ్ణి ఒక్కసారి ఓడించగలిగితే, వాడు మళ్ళీ నిన్నోడించలేడు. ఎలాగో అలా ఉగ్రసేనుణ్ణి ప్రలోభపెట్టి, తనకు తానే ఒక్కసారి ఓడిపోయేలా చేశావో – ఆ తర్వాతనుంచి వాణ్ణి తప్ప ఇంకెవరినైనా నువ్వు ఓడించగలుగుతావు. ఉగ్రసేనుణ్ణి సవాలుచేసి నువ్వే ఓడిపోయావో, ఈ మూలిక నీకింక పనిచేయదు," అని చెప్పాడు.

"ఉగ్రసేనుణ్ణి ఒక్కసారి ఓడిస్తే, అటుపైన అందర్నీ ఓడించడం సాధ్యపడుతుందంటే నాకు నమ్మకం కలగడం లేదు," అన్నాడు మహానందుడు.

బైరాగి నవ్వి, "మందైనా,వరమైనా నమ్మకంతోనే పనిచేస్తాయి. ఒక్కసారి విజయం చవిచూశావంటే, ఆ ఉత్సాహం నీలో కొత్త శక్తిని పుట్టిస్తుంది.మూలిక ప్రభావానికి ఆ శక్తి తోడయిందంటే నీకిక ఎదురుండదు," అని వెళ్ళిపోయాడు.



మహానందుడు, బైరాగి ఇచ్చిన మూలికను నమిలి మింగేశాడు. ఆ వెంటనే వాడిలో కొత్త ఉత్సాహం వచ్చింది. మరుక్షణం మంచి దుస్తులు ధరించి, ఒరలో కత్తిని పెట్టుకుని ఉగ్రసేనుడింటికి బయలుదేరాడు. దారిలో వాడికొక ముసలివాడు ఎదురై, "వాటం చూస్తే నువ్వు ఉగ్రసేనుణ్ణి సవాలు చేయడానికి బయల్దేరినట్లుంది. వాడి నోడించగలవాడు ఈ భూమ్మీద లేడని తెలియదా?" అన్నాడు.

"ఒక్కసారి ఎలాగో అలా ఉగ్రసేనుణ్ణి ఓడిస్తే, ఆ తర్వాత నన్నోడించగలవాడు ఈ భూమ్మీదవుండడు!"అన్నాడుమహానందుడు.

ఈ మాటలను వాడెంతో ధీమాగా అనడం విని ఆశ్చర్యపోయిన ముసలివాడు, అసలు



కథ అడిగి తెలుసుకుని, "ఒక్కసారికైనా ఉగ్రసేనుణ్ణి ఓడించడం అంత సులభమను కున్నావా? కత్తియుద్ధంలో ఉగ్రసేనుడి బల హీనత లేమిటో, నా ఒక్కడికే తెలుసు. వెయ్యి వరహాలిస్తే వారం రోజుల్లో నీ కవన్నీ నేర్పుతాను. ఆ తర్వాత నువ్వు తప్పక ఉగ్ర సేనుణ్ణి జయించి తీరతావు," అన్నాడు.

"నీ మాట నిజంకాకపోతే?"అన్నాడు మహా నందుడు అనుమానంగా.

"అప్పుడు నీ వద్ద డబ్బు తీసుకోను సరి కదా – నేనే నీకు వెయ్యి వరహాలిస్తాను!" అన్నాడు ముసలివాడు.

అయినా మహానందుడింకా అనుమాని స్తూంటే, ముసలివాడు ఆ విధంగా పత్రం కూడా రాసి ఇచ్చాడు. మారాలోచన లేకుండా మహానందుడు వెంటనే ముసలివాడి శిష్యు డయ్యాడు.

అయితే -- ఇందులో ఒక రహస్యమున్న దని మహానందుడికి తెలియదు. ఉగ్రసేను డికి, ఈ మధ్య కొన్నాళ్ళుగా విజయం అంటే మొహం మొత్తింది. ఓటమి ఎలా వుంటుందో చవిచూడాలని వుంది. ఆ విషయాన్ని వాడు ముసలివాడికి చెప్పి, "ఓడేటప్పుడు యోగ్యుడి చేతిలో ఓడితే గౌరవంగా వుంటుంది. అలాంటి వాణ్ణి నువ్వుఎన్నికచెయ్యి!" అన్నాడు.

ముసలివాడు కొన్నాళ్ళుగా ఆ ప్రయత్నం లోనే వున్నాడు. బైరాగి నుంచి మూలికను సంపాయించిన మహానందుడికంటే యోగ్యు డెవడుంటాడు?

ఒకవారం రోజులు గడిచాక మహానం దుడు, ఉగ్రసేనుణ్ణి సవాలు చేశాడు. చాలా మంది సమక్షంలో ఇద్దరి మధ్యా తీవ్రమైన కత్తియుద్ధం జరిగింది. మూలిక ప్రభావమో, దాని మీద నమ్మకమో తెలియదు కానీ – ఆ రోజు మహానందుడు కత్తియుద్ధంలో ఉగ్రసేనుడు మెచ్చుకునేటంత ప్రావీణ్యం చూపాడు. చివరకు ఉగ్రసేనుడు ఓడిపో యాడు.

ఉగ్రసేనుడికి ఓటమివుంటుందని ఎవరూ ఊహించలేదు. ఆ రోజున చందనపురమంతా అదొక విడ్డూరంగా చెప్పుకున్నారు. ఒక్క రోజులో మహానందుడు ఊళ్ళో గొప్పవాడైపో

యాడు. అందరూ వాణ్ణి చూడాలనీ, మాట్లాడా లనీ ఎగబడసాగారు.

మహానందుడు అన్న ప్రకారం ముసలి వాడికి వెయ్యి వరహాలూ ఇచ్చుకున్నాడు. ఆ రోజు నుంచి వాడికి మహావీరుడన్న పేరు వచ్చింది.

ఈలోగా,పూర్వం ఉగ్రసేనుడిచేతిలో ఓడి పోయిన మహావీరులు కొందరు, ఈ వార్త విని చందనపురం వచ్చారు. వారందరూ గతంలో మహానందుణ్ణి ఓడించినవారే! కత్తి యుద్ధంలో మహానందుడి ప్రావీణ్యమేపాటిదో వారికి తెలిసివుండడం వల్ల, "బహుశా ఉగ్ర సేనుడి ప్రావీణ్యం, శక్తియుక్తులూ కొంత తగ్గి వుంటవి," అనుకున్నారు.

జీవితంలో ఒక్కసారైనా ఉగ్రసేనుణ్ణి ఓడిం చాలని, ఆ మహావీరుల కోరిక. అందువల్ల వారందరూ ఉగ్రసేనుణ్ణి సవాలు చేశారు. ఐతే వాడాసవాలును లెక్కచేయక, "ఓటమి నన్ను కృంగదీసింది. నేనిప్పుడు ఎవరితోనూ పోటీ పడను. కావాలనుకుంటే మీరు వెళ్ళి, ఆ మహానందుణ్ణే సవాలు చేయండి," అన్నాడు.

ఆ మహావీరులందరూ మహానందుణ్ణి సవాలు చేసి, వాడి చేతిలో చిత్తుగా ఓడి పోయారు. మహానందుడు పూర్వపు మహానం దడు కాదని వారందరికీ అర్థమై, "మహా వీరాధివీరా! ఇంతకాలం ఉగ్రసేనుడే వీరుడ నుకుంటే, అంతకు మించిన వీరుడివి



నువ్వు. కత్తియుద్ధంలో నీకు నీవే సాటి!" అని పొగిడారు.

ఇందుకు మహానందుడెంతో సంతోషిం చినా, తానోడించిన ఉగ్రసేనుడిలో ఇప్పుడు వీరత్వం బొత్తిగా మిగిలి లేదని అనుమాన పడ్డాడు. విజయోత్సాహంతో తన బలం ఇనుమ డిస్తూంటే, ఒక్క ఓటమితో ఉగ్రసేనుడు నిర్వీర్యుడయ్యాడు. వాడిప్పుడు సాటి వీరులతో తలపడడానికి భయపడుతున్నాడు!

ఇలా ఆలోచించిన మహానందుడు, జను లందరూ శక్తిని కోల్పోయిన ఉగ్రసేనుణ్ణి, తానోడించినట్లు అనుకోకుండా వుండాలంటే – ఉగ్రసేనుడు కూడా మిగతా వీరులతో తలపడి వాళ్ళను ఓడించాలి. అందుకు

ఉగ్రసేనుణ్ణి ఒప్పించడానికి మహానందుడు, ముసలివాడి సాయం కోరాడు.

దానికి ముసలివాడు పెద్దగా నవ్వి, "ఉగ్రసేనుడు వారితో తలపడడు. కావాలంటే వారందర్నీ ఓడించిన నీతోనే తలపడతాడు!" అన్నాడు.

"నాతో ఇప్పటికే ఓడి వున్నాడు కదా!" అన్నాడు మహానందుడు దర్పంగా.

"ఓటమి ఎలావుంటుందో రుచి చూడాలని, అప్పుడు కావాలనే ఉగ్రసేనుడు నీ మీద ఓడాడు. ఇప్పుడిక వాడినోడించడం నీ తరం కాదు!" అన్నాడు ముసలివాడు.

"నాది విజయోత్సాహం. ఉగ్రసేనుడిది ఓటమి వల్ల కలిగిన నిరుత్సాహం, నిస్పృహ. ఈసారికూడా నేనే తప్పకజయిస్తాను!" అన్నాడు మహానందుడు ధీమాగా.

"నీకు తెలియదన్నమాట! ఉగ్రసేనుడు నువ్వు తిన్న మూలిక కంటే శక్తివంతమైన మూలిక తిన్నాడు. వాడినిక ఈ భూప్రపంచంలో ఎవరూ ఓడించలేరు," అన్నాడు ముసలివాడు చిన్నగా నవ్వుతూ.

ఆ జవాబుకు మహానందుడు ఆశ్చర్య పోయి, "ఉగ్రసేనుడికూ్కడా ఆబైరాగే మూలిక ఇచ్చాడా?" అని అడిగాడు.

ముసలివాడు ఏదో రహస్యం చెబుతున్న వాడిలా చిన్న గొంతుతో, "లేదు, నువ్వే ఇచ్చావు! సమర్థుడైన మహావీరుడు ఓటమి చవిచూస్తే, దెబ్బతిన్న పులిలా మరింత శక్తి మంతుడవుతాడు. ఉగ్రసేనుడు తిన్న మూలిక నీచేతిలో ఓటమి! ఓటమి ఎంత చిన్నతనమో తెలిశాక మళ్ళీ జీవితంలో వాడు దాన్ని కోరు కోడు," అన్నాడు.

అయినా విజయోత్సాహం కొద్దీ మహానం దుడు మరొకసారి ఉగ్రసేనుణ్ణి కత్తియుద్ధా నికి సవాలు చేసి, ఈసారి ఘోరపరాజయం చెందాడు.

ఉగ్రసేనుడికున్న సమర్థత లేనికారణంగా ఆ ఓటమిమహానందుడికి, ఆ తర్వాత కూడా అతణ్ణి ఓడించగల శక్తినివ్వలేదు.

ఇది జరిగాక మహానందుడు తన శక్తి ఏపాటో తెలుసుకుని, దానికి తగ్గ పోరాటాలకే అలవాటు పడ్డాడు.





# న్యాయనిర్ణయం

పూర్వం కాశ్మీరురాజ్యాన్ని సుకేతుడనే రాజు పరిపాలించేవాడు. శ్రీనగరు ఆ రాజ్యానికి రాజధాని. శ్రీనగరుకు దూరాన ఉన్న ఇంకొక నగరంలో ఒక న్యాయాధికారి ఉండేవాడు. న్యాయనిర్ణయం చెయ్యటంలో ఆయన ప్రజ్ఞ కనబరచసాగాడు. కొద్దికాలంలోనే ఆయన ఖ్యాతి కాశ్మీరురాజ్యమంతటా వ్యాపించింది.

ఈయనను ఎక్కడెక్కడివాళ్లూ మెచ్చుకుంటూ ఉండటం చూసిసుకేతమహారాజుకు ఆశ్చర్యం కలిగింది. ఆ న్యాయాధికారి న్యాయనిర్ణయం చేసి ఇచ్చే తీర్పులు ఎలా వుంటవో స్వయంగా చూడాలని ఆయనకు కోరిక కలిగింది.

వెంటనే ఆయన సామాన్యుడి దుస్తులు ధరించి, తన గుర్రాన్ని ఎక్కి ఆ న్యాయాధికారి ఉండే నగరానికి బయలుదేరాడు. సుకేత మహారాజు రెండు రోజులు ప్రయాణం చేసి తన గమ్యస్థానం చేరాడు. ఆయన నగర ద్వారం దాటి నగరంలోకి వెళుతూండగా దారి పక్కన ఉన్న ఒక కుంటిబిచ్చగాడు, "ధర్మప్రభూ!" అంటూ దగ్గరికి వచ్చాడు.

రాజు వాడి చేతిలో కొంత డబ్బు పెట్టి ముందుకు సాగిపోబోయాడు. కాని బిచ్చగాడు ఆయనను వదలక మళ్ళీ, "ధర్మప్రభూ!" అన్నాడు.

"ధర్మం చేస్తినిగదా? ఇంకేం కావాలి?" అన్నాడు రాజు.

"బాబూ, నగరంలో సంత సాగుతోంది. కుంటివాణ్ణి, అంత దూరం నడిచిపోలేను. గుర్రం మీద, మీ వెనక, ఎక్కించుకోండి. సంతదగ్గిర దిగి నాదారిన పోతాను!" అన్నాడు కుంటిబిచ్చగాడు.

"సరే ఎక్కు", అని రాజు ఆ బిచ్చగాణ్ణి తన వెనక కూచోబెట్టుకుని నగరమధ్యానికి వెళ్ళాడు. అక్కడికి దగ్గర్లోనే సంత జరుగుతున్నది.



"ఇదే సంత. ఇక నువ్వు దిగి వెళ్ళవచ్చు," అన్నాడు రాజు.

"నువేదిగుముందు,"అన్నాడు బిచ్చగాడు.

వాడు దిగలేక తన సహాయం కోరుతున్నాడనుకుని రాజు గుర్రం దిగి,"నా చెయ్యి పట్టుకుని జాగ్రత్తగా దిగు!" అన్నాడు బిచ్చగాడితో.

"నన్ను దిగమనటానికి నువ్వెవరు? పోనీ పాపమని గుర్రం ఎక్కనిచ్చినందుకా?" అన్నాడు బిచ్చగాడు.

"నాగుర్రం మీదనన్ను నువ్వు ఎక్క నిచ్చేదేమిటి? పిచ్చిమాటలాడక దిగు!" అన్నాడు రాజు.

"ఈ గుర్రం నాది,నేను దిగను!" అన్నాడు బిచ్చగాడు ఖచ్చితంగా.

"ఇంత అన్యాయం నేనెక్కడా చూడలేదు. ఈ నగరంలో గొప్ప న్యాయాధికారి ఉన్నాడు తెలుసా?" అన్నాడు రాజు.

"ఎంత న్యాయాధికారి అయితే మాత్రం ఈగుర్రం నాలాటి కాళ్ళులేనివాడిదని తీర్పు ఇస్తాడుగాని, పిడిరాయిలాగా ఉన్న నీదని ఒక్క నాటికీ చెప్పడు!" అన్నాడు బిచ్చగాడు.

"ఏం చెబుతాడో తెలుసుకుందాం, న్యాయస్థానానికి పద!" అన్నాడు రాజు.

"నాకేంభయంలేదు.పోదాంపద!" అన్నాడు బిచ్చగాడు.

న్యాయాధికారితమఇద్దరిమధ్యాఏవిధంగా న్యాయంచెబుతాడోచూడాలని రాజుకు కోరిక కలిగింది. రాజూ, బిచ్చగాడూ కలిసి న్యాయస్థానానికి వెళ్లేసరికి, అప్పటికే కొన్ని ఫిర్యాదులను గురించి విచారణ జరుగుతున్నది.

ఒక కరణమూ, ఒక రైతూ ఒక స్త్రీని గురించి తగాదాపడి వచ్చారు.ఆ స్త్రీ మూగది. ఆమె నా భార్య అంటే నా భార్య అని ఆ ఇద్దరు పురుషులూ తగాదా పడుతున్నారు. ఇద్దరూ ప్రమాణాలు చేశారు.

"సరే, ఈ రోజు ఈమెను నా దగ్గర వదిలి వెళ్లండి. రేపు నేను మీకు తీర్పు చెబుతాను," అన్నాడు న్యాయాధికారి.

తరవాత ఒక కసాయీ, ఒక నూనెగానుగవాడూ వచ్చారు. కసాయి చేతిలో గుప్పెడు చిల్లర డబ్బులున్నాయి. గానుగవాడి చేతుల నిండా నూనె ఉన్నది.

"అయ్యా, ఈ కసాయి నా దగ్గిరికి వచ్చి, ఒక మొహరీకి చిల్లర ఇచ్చేట్టయితే నూనె కొంటానన్నాడు. నేను నా దగ్గిర ఉన్న చిల్లర అంతా తీసి లెక్క పెడుతూండగా, డబ్బులన్నీ లాగేసుకుని అవి తనవేనంటున్నాడు. తమరే న్యాయం చిత్తగించాలి!" అన్నాడు నూనె గానుగవాడు.

"అయ్యా, నేను ఈ మనిషి దగ్గర నూనె కొనటానికి వెళ్లినమాట నిజమే. నా జేబులో ఎంత డబ్బున్నదోనని తీసి లెక్కపెట్టుకుం టూంటే ఈ మనిషి నా చెయ్యి పట్టుకుని ఈ డబ్బులు తనవే నంటున్నాడు. న్యాయం చిత్తగించాలి!" అన్నాడు కసాయి.

"ఆ డబ్బులు నావద్ద ఉంచి,రేపు రండి. తీర్పు చెబుతాను!" అన్నాడు న్యాయాధికారి. తరవాత గుర్రం తగాదా వచ్చింది.

"అయ్యా, మాది శ్రీనగరు. ఇవాళ సంతలో కొన్ని సరుకులు కొందామని నేను నాగుర్రం మీద ఎక్కి ప్రయాణమై వచ్చాను. నగరద్వారం వద్ద ఈ కుంటిమనిషి తగిలి నన్ను ధర్మం అడిగాడు. డబ్బులిచ్చాను. తరవాత తనను నా గుర్రం మీద ఎక్కించుకుని సంతవద్దకు చేర్చమన్నాడు. అలాగే చేశాను. కాని సంతవద్ద ఈ మనిషి దిగకపోగా, పైపెచ్చు ఈ గుర్రం తనదేనంటున్నాడు!" అని రాజు చెప్పాడు.

"అయ్యా, నేను కాళ్లులేని వాణ్ణి. అందు చేత ఎక్కడికి వెళ్లినా ఈ గుర్రం మీదే వెళ తాను. సంతకోసమని నేను వస్తూండగా ఈ



పెద్దమనిషి ద్వారం వద్దకనిపించాడు. చాలా దూరం నడిచి డస్సిపోయానని చెప్పి, తనను ఎలాగైనా సంతకు చేర్చమన్నాడు. సరేగదా అని సంతదాకా తెస్తే ఈ గుర్రం తనదేనని నాతో పేచీ పడ్డాడు! తమరు న్యాయం నిర్ణ యించండి!" అన్నాడు కుంటివాడు.

న్యాయాధికారి ఒక క్షణం ఆలోచించి, "ఈ గుర్రాన్ని నావద్ద ఉంచి వెళ్లి, మళ్లీ రేపు రండి. తీర్పు చెబుతాను!" అన్నాడు.

మర్నాడు న్యాయస్థానానికి ఫిర్యాదీలూ, ప్రేక్షకులూ వచ్చారు.

న్యాయాధికారి కరణాన్ని పిలిచి, "ఈ స్త్రీ మీ భార్యే. మీ రామెను తీసుకువెళ్లండి. ఈ రైతు తప్పుడు ఫిర్యాదు చేసినందుకు గాను



యాబై కొరడా దెబ్బలు శిక్ష విధిస్తున్నాను," అన్నాడు.

తరవాత ఆయన రెండవ ఫిర్యాదీ అయిన కసాయిని పిలిచి, "ఈ డబ్బులు నీవే, తీసుకో.తప్పుడు ఫిర్యాదు చేసినందుకు నూనె గానుగవాడికి యాబై కొరడా దెబ్బలు శిక్ష!" అన్నాడు.

తరవాత న్యాయాధికారి రాజునూ, కుంటి వాణ్ణీ పిలిచి, "మీరు తగాదాపడే గుర్రాన్ని ఇరవై గుర్రాల మధ్య కట్టేయించాను! వాటిలో మీ గుర్రాన్ని మీరు పోల్చుకో గలరా?" అని అడిగాడు.

పోల్చుకోగలనని రాజు అన్నాడు. పోల్చుకో గలనని కుంటివాడు కూడా అన్నాడు.

న్యాయాధికారి రాజుతో, "ముందు నువ్వు నావెంట రా!" అని తీసుకుపోయాడు.

ఇరవై గుర్రాల మధ్య ఉన్న తన గుర్రాన్ని రాజు సులువుగా గుర్తించాడు. "సరే, నువ్వు న్యాయస్థానానికి వెళ్లి, కుంటివాణ్ణి పంపించు!" అన్నాడు న్యాయాధికారి.

రాజు అలాగే చేశాడు.కుంటివాడు కూడా రాజులాగే గుర్రాన్ని గుర్తించాడు.

న్యాయాధికారి న్యాయస్థానానికి తిరిగి వచ్చి, రాజుతో, "ఆ గుర్రం నీదే. దాన్ని నువ్వు తీసుకుపోవచ్చు. తప్పుడు ఫిర్యాదు చేసినందుకు కుంటివాడికి యాబై కొరడా దెబ్బల శిక్ష విధిస్తున్నాను!" అన్నాడు.

అంతటితో ఆ పూటకు కచేరీ ముగిసింది, అందరూ వెళ్లిపోయారు.రాజు ఒక్కడే ఉండి పోవటం చూసి న్యాయాధికారి, "ఇంకా ఎందుకు ఇక్కడే ఉన్నావు. నే నిచ్చిన తీర్పు నీకు తృప్తికరంగా లేదా?" అని అడిగాడు.

"చాలా తృప్తికరంగా ఉంది. ఆ విషయమే మీతో మాట్లాడాలని ఆగాను. న్యాయం చెప్పటం తేలిక కాదు. నా ఫిర్యాదు విషయంలో మీరు న్యాయమే చెప్పారని నాకు తెలుసు. మిగిలిన ఫిర్యాదుల సంగతి నేనేమీ చెప్పలేను. బహుశా వాటిలో కూడా న్యాయంగానే తీర్పుచెప్పి ఉంటారు!కానిమీరు అంత తెలివిగా ఎలా న్యాయనిర్ణయం చేస్తారో నేను ఊహించలేకుండా ఉన్నాను," అన్నాడు రాజు.

"అది నువ్వనుకున్నంత కష్టం కాదు. ఆ స్త్రీ విషయం తీసుకో. ఆమెను నిన్న రాత్రి మా ఇంటికి తీసుకుపోయాను. ఇంటికి వెళ్ల గానే ఆమెను పిలిచి నా కలందాన్ కడిగి అందులో సిరా పొయ్యమన్నాను. ఆమె ఆ పని చెయ్యటం అలవాటున్నదానిలాగా ఆ పని చేసేసింది. మామూలు రైతు భార్య అయితే అలాచెయ్యలేదు. అందుచేత ఆమె కరణం భార్యేనని నిర్ణయించాను," అన్నాడు న్యాయాధికారి.

"అదిసరే, డబ్బులు కసాయివాడివేనని ఎలా నిర్ణయించారు?" అన్నాడు రాజు కుతూహలంగా.

"అది మరీ తేలిక. నూనెవాడి చేతులూ, అరిచేతులూ నూనె ఓడుతూ ఉండటం నువ్వు గమనించే ఉంటావు. అవి వాడి చేతితో పట్టుకున్న డబ్బులయితే వాటికి నూనె అంటి ఉండాలి. ఆ డబ్బులను నీటిలో వేసి చూశాను.. అందులోంచి ఒక్కచుక్క నూనె కూడా నీటి మీద తేలలేదు," అన్నాడు న్యాయాధికారి.

"మా తగాదాలో గుర్రం నాదని ఎలా నిర్ణయించారు? కుంటివాడు గుర్రాన్ని గుర్తించలేక పోయాడా?" అని రాజు అడిగాడు.

"గుర్తించాడు. మీరిద్దరూ గుర్రాన్ని గుర్తించ గలరని నాకు ముందే తెలుసును!" అన్నాడు న్యాయాధికారి.

రాజు ఆశ్చర్యంతో, "అయితే మరి గుర్రం నాదని మీరు ఎలా నిర్ణయించారు?" అని అడిగాడు.

"నేను గమనించినది మీలో ఎవరు గుర్రాన్ని గుర్తించుతారా అని కాదు; గుర్రం మీలో ఎవరిని గుర్తించుతుందా అని! అది నిన్నే గుర్తించింది! అందుచేత గుర్రం నీదని నిర్ణయించాను!" అన్నాడు న్యాయాధికారి.

ఆ న్యాయాధికారి తెలివితేటలు సుకేత మహారాజుకు అపూర్వంగా కనిపించాయి. ఆయన శ్రీనగరుకు తిరిగివెళ్లాక న్యాయాధికారిని రప్పించి ఆయనకొక జాగీరు బహూకరించాడు. తాను తీర్పు చెప్పినది మహారాజుకేనని తెలిసి న్యాయాధికారి పొందిన ఆశ్చర్యానికి అంతులేదు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



Mahantesh C. Morabad



Mahantesh C. Morabad

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * నవంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : స్కేటింగ్‌లో లేరెవరూ నాకు పోటీ! రెండవ ఫోటో : బొంగరంఆటలో నాకు నేనే సాటి!

పంపినవారు : బి.వి.ఎల్. సరోజ, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా,

గుడివాడ, కృష్ణాజిల్లా - 521 301 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

